Hurmate Sood - Kya Daure
Jadeed mein khbile Amal Hai?
(Telugu)

# ఆధునిక యుగంలో
# వడ్డీ నిషేధం సాధ్యమా?

మూలం

**డాక్టర్ ముహమ్మద్ ఉమర్ ఛాప్రా**

అనువాదం

**అబుల్ ఫౌజాన్**

M.A. *(Islamic Studies)*, M.A. *(Urdu)*

# విషయ సూచిక

ప్రొఫెసర్ ఎక్బాల్ అలీ
వైస్ చాన్సలర్
శాతవాహన విశ్వవిద్యాలయం,
కరీంనగర్, ఆంధ్రప్రదేశ్

# ప్రజలకొక మాట

'*ఆధునిక యుగంలో వడ్డీ నిషేధం సాధ్యమా?*' అనే ఈ పుస్తకం ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త డాక్టర్ ముహమ్మద్ ఉమర్ ఛాప్రాగారి మూడు ఆంగ్ల ఉప న్యాసాల అనువాదం. దీనిని తెలుగు ప్రజలకు అందించాలనే సదుద్దేశంతో అబుల్ ఫౌజాన్‌గారు తెలుగుభాషలోకి అనువదించి అందజేస్తున్నందుకు సంతోషంగా ఉంది. ఇందులోని భాష సరళంగా, సూటిగా ఉంది.

సమాజ రుగ్మతల్లో ఒకటైన ప్రజలను దోపిడీకి గురిచేస్తున్న వడ్డీ వ్యవస్థపై అవగాహన కలిగించాలనే తపనతో అనువాదకులు మంచి కృషి చేశారు.

**దీనిలో గమనించాల్సిన ముఖ్యాంశాలు:**

1. అన్ని ధర్మాల్లోనూ వడ్డీని నిషేధించడం జరిగింది. ఏ మతమూ న్యాయానికి అవరోధం కాదు. ఇస్లామ్ ధార్మిక గ్రంథమైన దివ్య ఖురాన్‌లో, క్రైస్తవుల ధార్మిక గ్రంథమైన బైబిల్‌లో, హిందూ ధర్మానికి సంబంధించిన మనుస్మృతిలో, యూదుల పవిత్ర గ్రంథమైన తల్ మూద్‌లో కూడా వడ్డీ నిషేధించబడింది.
2. వ్యాపారికి లాభం, నష్టం రెండూ అవకాశాలున్నప్పుడు పెట్టుబడిదారు (వడ్డీదారు) కూడా ఈ రెండు విషయాల్లో పాలుపంచుకోవాలి. ఇద్దరి మధ్య న్యాయప్రదంగా వ్యవహారం జరగాలి.
3. వడ్డీ ప్రాతిపదికపై ఏర్పడి ప్రస్తుతం చలామణిలో ఉన్న ఆర్థిక వ్యవస్థ ప్రజలను తమస్థాయి కన్నా అధికంగా, విలాసాలపై ఖర్చు పెట్టే

మనస్తత్వాన్ని పురిగొల్పుతుంది. అందువల్ల పొదుపులో తగ్గింపు వచ్చింది.

గడిచిన మూడు దశకాల్లో అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలో పదేపదే పునరావృతమవుతున్న ఆర్థిక సంక్షోభాలు కూడా బహుశ ఇస్లామిక్ పెట్టుబడి దారీ విధానంపై దృష్టి మరలడానికి కారణభూతమయిందేమో! ఈ సంక్షోభాల కారణంగా ప్రపంచం ఒక కొత్త ఆర్థిక విధానాన్ని వెదుకుతున్నది. ఈ విషయంలో సేకరించిన సైద్ధాంతిక సమాచారాన్ని అధ్యయనం చేస్తే, ఆర్థిక వ్యవస్థలో మేలైన, సముచితమైన క్రమశిక్షణను పరిచయం చేయడానికి అత్యంతవసరమున్నదని ప్రపంచం గుర్తించినట్లు విదితమవుతోంది. స్వంత మిగులుపై ఆధారపడిన పెట్టుబడుల్ని (Equity) పెంచుకొని, అప్పులపై ఆధారపడిన పెట్టుబడుల్ని తగ్గించుకుంటే, ఇలాంటి ఆర్థిక సంక్షోభాల తీవ్రత చాలా వరకు తగ్గిపోతుందనే ఆలోచనలు కూడా పటిష్టమవుతున్నాయి. పై వివరించిన వివిధ కారణాల ఆధారంగా ఇస్లామిక్ వ్యవస్థను అర్థం చేసుకోవడం లోనూ, దాని ప్రయోజనాన్ని గుర్తించడంలోనూ గణనీయమైన పెరుగుదల వచ్చిందంటే అందులో అతిశయోక్తి లేదు.

ఈ ప్రజాస్వామ్య దేశంలో ఏ మార్పు రావాలన్నా ప్రజల ద్వారానే సాధ్యం. ఏదైనా సాధించాలంటే ప్రజల ఆలోచనా విధానంలో (మైండ్ సెట్) మార్పు తెచ్చే విధంగా ప్రయత్నించాలి. ఈ పుస్తకం ఆ పనిని చేస్తుంది. చదవండి. ఆలోచించండి. వ్యవస్థను మార్చండి.

చివరగా అబుల్ ఫౌజన్‌గారు సమాజం కోసం చేసిన ఈ కృషిని అభినందిస్తున్నాను. దైవం మరింత కృషి చేసే సౌభాగ్యం కలుగచేయుగాక.

ఆచార్య ఎక్బాల్ అలీ
వైస్ చాన్సలర్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# పరిచయం

డాక్టర్ ముహమ్మద్ ఉమర్ ఛాప్రాను పాఠకులకు పరిచయం చేయ వలసిన అవసరం లేదు. ఎందుకంటే ఆర్థిక శాస్త్ర విభాగంలో పేరెన్నికగన్న వ్యక్తుల్లో ఆయన ఒకరు. గడిచిన ముప్ఫైయి సంవత్సరాల్లో ఆర్థికశాస్త్ర సమస్య లపై, ముఖ్యంగా ఇస్లామీయ ఆర్థిక, బ్యాంకింగ్ వ్యవస్థలపై చర్చించిన ప్రముఖుల్లో ఆయనకు విశిష్టస్థానముంది. ఈ రంగాలకు సంబంధించిన 12 పుస్తకాలను ఆయన రచించారు. ఆయన వ్రాసిన 80కి పైచిలుకు సైద్ధాంతిక పరమైన వ్యాసాలు అంతర్జాతీయంగా ప్రఖ్యాతిగాంచిన పత్రికల్లో ప్రచురింప బడ్డాయి. ఇవే కాకుండా ఆయన వ్రాసిన అనేక పుస్తకాలు, వ్యాసాలు ప్రపంచం లోని దాదాపు 12 ప్రముఖ భాషల్లో అనువదించబడ్డాయి. విస్తృతమైన తన జ్ఞానం, సమతుల్యతతో కూడిన తన ఆలోచనాసరళి, చెప్పదలచుకున్నది సూటిగా చెప్పే తత్వం వల్ల విద్యాధికులు, జ్ఞానుల అన్ని వర్గాల్లో ఆయన అత్యంత గౌరవాభిమానాలతో ఆదరించబడ్డారు.

ఇస్లామీయ ఆర్థిక, బ్యాంకింగ్ వ్యవస్థలపై ఆయన ఇచ్చిన ఉపన్యాసా లను ప్రపంచంలోని వివిధ యూనివర్శిటీ లలో, విద్యాధిక వర్గాల్లో ప్రశంసిం చటం జరిగింది. ఈ విధంగా ఆయనను గౌరవించి, ప్రశంసించిన వాటిలో అమెరికా, బ్రిటన్, స్పెయిన్, ఇటలీ, టర్కీ ఈజిప్టు, జోర్డాన్, ఈరాన్, ఇండో నేషియాకు చెందిన అనేక యూనివర్శిటీలు ప్రముఖంగా పేర్కొనదగినవి. జ్ఞాన

పరంగా, సైద్ధాంతికపరంగా ఆయన అందించిన అమూల్య సేవలకు గుర్తింపుగా 1989లో ఇస్లామిక్ డెవలప్‌మెంట్ బ్యాంక్ అవార్డు, కింగ్ ఫైసల్ ఫౌండేషన్ తరఫున కింగ్ ఫైసల్ అవార్డుతో ఆయన్ని సత్కరించడం జరిగింది. అమెరికాకు చెందిన విస్కాన్సిన్ (wisconsin) మరియు కెన్‌టకీ (kentucky) యూనివర్శిటీల్లో డాక్టర్ ఛాప్రా అసిస్టెంట్, అసోసియేట్ ప్రొఫెసర్‌గా పనిచేశారు. పాకిస్తాన్‌లోని ఇనిస్టిట్యూట్ ఆఫ్ డెవలప్‌మెంట్ ఎకనామిక్స్, ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇస్లామిక్ రీసెర్చ్‌లలో కూడా కొంతకాలం పనిచేశారు. అమెరికాలో కూడా ఆయనకు అపూర్వ గౌరవాదరణలు లభించాయి. కాని ఆయన తాను జీవితాంతం ఉండేందుకుగాను సౌదీ అరేబియాను ఎంచుకున్నారు.

1965 నుండి 1999 వరకు అంటే దాదాపు 35 సంవత్సరాలు ఆయన సౌదీ అరేబియా సెంట్రల్ బ్యాంక్ (సౌదీ అరేబియన్ మానిటరీ ఏజన్సీ)లో ఆర్థిక సలహాదారుగా విధుల్ని నిర్వర్తించారు. ఆయన అందించిన గణనీయమైన సేవలకు గుర్తింపుగా అప్పటి సౌదీ అరేబియా ఆర్థిక శాఖా మంత్రి షేఖ్ ముహమ్మద్ అబుల్ ఖైల్ సిఫారసు మేరకు, సౌదీ అరేబియా ప్రభుత్వం ఆయనకు ఆ దేశ పౌరసత్వాన్ని ప్రసాదించింది. ఆ కాలంలో కింగ్ ఖాలిద్ బిన్ అబ్దుల్ అజీజ్ రాజ్యాధినేతగా ఉన్నారు. ఆయన సౌదీ అరేబియన్ మానిటరీ ఏజన్సీ నుండి రిటైర్ అయిన తరువాత, జిద్దాలోని ఇస్లామిక్ డెవలప్‌మెంట్ బ్యాంకుకు చెందిన ఇస్లామిక్ రీసెర్చ్ అండ్ ట్రైనింగ్ ఇనిస్టిట్యూట్ సంస్థ వారు ఆయన్ను తమ సలహాదారుగా నియమించుకున్నారు.

డాక్టర్ ముహమ్మద్ ఉమర్ ఛాప్రా అవిభక్త భారతదేశంలో 1933లో

జన్మించారు. ఆయన ప్రాథమిక విద్య ముంబైలో అభ్యసించారు. భారత, పాకిస్తాన్ విభజన తరువాత ఆయన కుటుంబం పాకిస్తాన్‌కు వలసపోయింది. అక్కడ కరాచీలో వారు స్థిరనివాసమేర్పరుచుకున్నారు. అక్కడే ఆయన మెట్రిక్, బి.కామ్., ఎం.కామ్‌లు ఉన్నతశ్రేణుల్లో ఉత్తీర్ణులయిన తరువాత 1961లో అమెరికాలోని మినోసోటా (Minnosota) యూనివర్శిటీ నుంచి పి.హెచ్.డి. పట్టా పుచ్చుకున్నారు. ఆయన విద్యార్థి దశ నుండే ఇస్లాం సేవ కోసం అంకితం అయ్యారు, దైవానుగ్రహం వల్ల నేటికీ ఆయన అందులోనే నిమగ్నమై ఉన్నారు.

ఈ పుస్తకం డాక్టర్ ఛాప్రాగారి మూడు ఆంగ్ల ఉపన్యాసాల అనువాదం. విద్యాధిక వర్గాల్లో అమితంగా ప్రశంసించబడిన ఆయన ఈ ఉపన్యాసాలు, కొన్ని సంవత్సరాల క్రితం సౌదీ అరేబియా నుండి ప్రచురించబడ్డాయి. ఆ తరువాత ఈ ఉపన్యాసాలన్నింటినీ పొందుపరచి దక్షిణాఫ్రికాకు చెందిన ఇస్లామిక్ దావా మూవ్‌మెంట్ (Islamic Dawa Movement) సంస్థ పుస్తక రూపంలో ప్రచురించింది.

ఈ పుస్తకంలో ఆయన కొన్ని ప్రత్యేకత కలిగిన ప్రశ్నలకు సమాధాన మిచ్చారు. అవి అందరికీ ఉపకరిస్తాయి. ఇవే కాకుండా, వడ్డీని వ్యతిరేకించే వారు తరచుగా ఎదుర్కొంటున్న ఆధునిక పరిస్థితులకు సంబంధించిన ప్రశ్నలకు కూడా ఆయన సముచిత సమాధానాలిచ్చారు.

ఉదాహరణకు ఇస్లాం నిజంగానే వడ్డీని నిషేధించిందా? అయితే దానికి దారితీసిన కారణాలేమిటి? దానిలో దాగియున్న యుక్తులేమిటి? అన్నిటికన్నా ప్రముఖమైన ప్రశ్న, ప్రవక్త మహనీయులు (స) కాలం కన్నా ఎంతో భిన్నంగా నున్న నేటి ఆధునిక కాలంలో ఆమోదింపదగిన, ఆచరణాయోగ్యమైన వడ్డీ

రహిత ఇస్లామిక్ బ్యాంకింగ్ వ్యవస్థ సాధ్యమా? అనే విషయాన్ని కూడా ఆయన ఎంతో సరళంగా మనోజ్ఞంగా వివరించారు.

ఈ పుస్తకాన్ని రూపొందించడంలోనూ, ప్రచురించడంలోనూ సహాయ సహకారాలందించిన శ్రేయోభిలాషులందరికీ దైవం మహోన్నత ప్రతిఫలాన్ని ప్రసాదించాలని, ప్రజలు సన్మార్గాన్ని అవలంబించడంలో ఈ పుస్తకం మార్గ దర్శకమవ్వాలని, పరలోకంలో ఇది మన అందరి ముక్తికి సాధనం కావాలని నిండు మనస్సుతో దైవాన్ని వేడుకుంటున్నాను.

**- గులాం అహ్మద్ ఇస్మాయీల్**

# 1. ఇస్లాంలో వడ్డీ నిజంగానే నిషిద్ధమా?

## రిబా -లేక -వడ్డీ ఏది నిషేధితం?

ఇస్లాంలో వడ్డీ నిజంగానే నిషిద్ధమా? అని పదే పదే ప్రశ్నింపబడుతుంది. ఇస్లాం దేన్నయితే నిషేధించిందో అది 'రిబా'నే కాని వడ్డీ కాదని కొందరు వాదించడమే దీనికి కారణం. రిబా మరియు వడ్డీ రెండూ ఒకటి కావనేది వారి వాదన. ఈ వాదనలో ఏమైనా పస ఉందా అనేది పరిశీలిద్దాం.

దివ్యఖుర్ఆన్ మరియు ప్రవక్త ప్రవచనాల్లో (హదీసుల్లో) దైన్నయితే నిషేధించడం జరిగిందో అది 'రిబా' అనడంలో అనుమానంలేదు. ఖుర్ఆన్‌లో నాలుగు వివిధ స్థానాల్లో 'రిబా' నిషేధం గురించి పేర్కొనడం జరిగింది. మొట్ట మొదటగా నిషేధాన్ని పేర్కొంటూ అవతరించిన సూర రూమ్‌లోని 39వ ఆయత్ మక్కా నగరంలో అవతరించింది. మిగిలిన మూడు చోట్ల అనగా సూర నిసాలోని 161వ ఆయత్, సూర ఆలి ఇమ్రాన్‌లోని 130వ ఆయత్, సూర బఖరాలోని 275 నుండి 281వరకు గల ఆయతులు. పై ఆయతులన్నీ కూడా మదీనా నగరంలో అవతరించినవే. ఇందులో సూర బఖరాకు చెందిన ఆయత్‌లు ప్రవక్త (స) జీవితపు చివరి రోజుల్లో అవతరించాయి. వడ్డీ నిషేధపు ఉత్తర్వులకు సంబంధించి ఈ ఆయత్‌లలో అత్యంత తీవ్రత మరియు కాఠిన్యత లున్నాయి. వడ్డీ తీసుకునే వారిని, వడ్డీ ఇచ్చేవారిని తీవ్రంగా హెచ్చరించడం

జరిగింది. 279వ ఆయత్‌లోనైతే వడ్డీ పుచ్చుకునే వారికి వ్యతిరేకంగా దైవం, దైవప్రవక్త (స) తరఫున యుద్ధం ప్రకటించబడింది. ఖుర్‌ఆన్ ఇంతటి తీవ్రపదజాలాన్ని ఇంకే నేరానికీ ఉపయోగించి ఉండలేదు. వ్యాపారం మరియు 'రిబా' రెండూ ఒకటి కానేరవని, రెండింటిలో భేదముందని ఈ ఆయతులలో స్పష్టపరచడం జరిగింది. ఇంతవరకు అప్పులపై బాకీ ఉన్న సర్వ 'రిబా'లను వదులుకోవాల్సిందిగా ముస్లింలను ఆదేశించడం జరిగింది.

ప్రవక్త మహనీయులు (స) కూడా స్పష్టమైన పదాల్లో 'రిబా'ను నిషేధితంగా పేర్కొన్నారు. ఇంకా ఆయన (స) ఇలా అన్నారు: 'రిబా' (వడ్డీ)ని ఇచ్చి పుచ్చుకునే వారిని మాత్రమే దైవం దూషించలేదు, వడ్డీ ఒప్పందాన్ని వ్రాసేవాణ్ణి, దానికి సాక్షులుగా ఉండేవారిని కూడా దైవం దూషించాడు.[1] తెలుసుండీ వడ్డీ ఇచ్చిపుచ్చుకునే చర్యను ముప్పది ఆరు సార్లు వ్యభిచారం చేసినంతగానూ, తన స్వంత తల్లిని చెరచినదానికన్నా ఎక్కువ పాపంగానూ ఆయన (స) గారు పేర్కొన్నారు.[2]

దివ్యఖుర్‌ఆన్ మరియు ప్రవక్త మహనీయులు (స) వడ్డీని ఇంత కఠినంగా నిషేధించారు. అంతేకాక **"నేను ధర్మాన్ని మీ కోసం సంపూర్ణం చేశాను" (అల్‌మాయిద:3)** అంటూ దైవం చేసిన ప్రకటన తరువాత కూడా కొంత మంది దీని భావం సందిగ్ధంగా ఉందని, పద్నాలుగు శతాబ్దాల కాలం గడిచినప్పటికీ దీని భావం స్పష్టం కాలేదని వాదించడం విశ్వసించదగినదిగా ఎంత మాత్రంలేదు. సరే ఈ 'రిబా' నిజమైన భావం లేక అర్థం ఏమిటో తెలుసుకోవడానికి ప్రయత్నిద్దాం. దీనికోసం ఇస్లాంకు మూలాధారాలయిన ఖుర్‌ఆన్, ప్రవక్త మహనీయులు (స) సున్నత్ (ఆచరణలను) ఆశ్రయించాల్సిన అవసరముంది.

'రిబా' అనే పదానికి 'పెరగడం', 'ఎక్కువ కావడం', 'వ్యాపించడం', 'చిగురించడం' లేక 'అభివృద్ధి చెందడం' అని అర్థం వస్తుంది.[3] అయితే ప్రతి

వృద్ధిని ఇస్లాం నిషేధించలేదు. వ్యాపారంలో వచ్చే లాభం వల్ల కూడా మూల ధనంలో అభివృద్ధి, పెరుగుదల కానవస్తుంది. కాని ఇది నిషేధింపబడలేదు. అందుకని ఏ విషయాన్ని (పెరుగుదలను) నిషేధించడం జరిగిందనేది ప్రశ్న. ఈ ప్రశ్నకు సరియైన, ఖచ్చితమైన సమాధానం ఇవ్వగలిగే వ్యక్తిత్వం స్వయంగా ప్రవక్త మహనీయుల(స)దే కాగలుగుతుంది. ఎందుకంటే, ఆయనే దివ్య ఖుర్‌ఆన్‌ను అందరికంటే అమితంగా అర్థం చేసుకోగలిగిన వారు. ఒక హదీసులో, అప్పు ఇచ్చినందుకు ప్రతిఫలంగా చిన్నపాటి కానుకను లేక ఓ స్వల్ప సేవను స్వీకరించడాన్ని కూడా ఆయన (స)గారు 'రిబా' (వడ్డీ)గా పేర్కొన్నారు. ఇంకొక హదీసులో, అప్పిచ్చిన వానికి మూలధనంకన్నా ఒక ప్లేటు భోజనం పెట్టినా లేక అప్పుతీసుకున్న వాని వాహనంపై పయనించడాన్ని కూడా ఆయన (స)గారు నిషేధించారు.[4] ప్రవక్త మహనీయుల(స) పై వివరణ తరువాత అప్పుపై ఒక నిర్ణీత నిష్పత్తిలో ఆర్థిక ప్రతిఫలం పొందే ప్రసక్తే ఉండదు. వేరొక రకంగా చెప్పాలంటే, స్వయంగా ప్రవక్త మహనీయులు (స) 'రిబా'ను, నేటి మన కాలంలో పిలుస్తున్న 'వడ్డీ'కి సమానంగా పరిగణించారు.

'రిబా'కు సంబంధించిన ఈ అర్థం లేక భావం, ఇస్లామీయ చరిత్రలోని ధార్మికవేత్తలందరి వ్రాతల్లో మనకు స్పష్టంగా కనబడుతుంది. దివ్యఖుర్‌ఆన్‌కు సంబంధించిన ఏ వ్యాఖ్యానాన్ని తీసుకున్నా లేక హదీసుకు చెందిన ఏ వివరణ అయినా లేక అరబ్బీ భాషలోని ఏ నిఘంటువును పరిశీలించినా 'రిబా'కు (వడ్డీ కాక) వేరే అర్థం లేక భావం ఇచ్చినట్లు కనిపించదు. ఉదాహరణకు– ఖుర్‌ఆన్ వ్యాఖ్యాతల్లో సుప్రసిద్ధుడైన అల్‌ఖుర్‌తబి (నిర్యా : 1070) స్పష్టమైన పదాల్లో దీన్ని ఇలా వివరించారు. "అప్పుగా ఇచ్చిన ధనంపై, ఏ కొంచెం కూడా అధికంగా ఇవ్వాలనే షరతు, 'రిబా' (వడ్డీ)గానే భావించబడుతుందని, అధికం అనేది పిడికెడు మేత అయినా లేక ధాన్యపు ఒక్క గింజ అయినా సరే అంటూ

ఇబ్నె మస్ఫూద్ (రజి) ఉల్లేఖించిన ప్రవక్త మహనీయుల ఆదేశాన్ని ముస్లిము లందరూ అంగీకరిస్తారు." [5]

ఇదేవిధంగా "లిసాన్‌అల్ అరబ్" పేరుతో రూపొందించిన తన ప్రామాణిక అరబ్బీ నిఘంటువులో "ఇబ్నె మంజూర్" కూడా ఈ విషయాన్ని స్పష్టంగా పేర్కొన్నారు. అప్పుపై అసలుకన్నా అధికంగా వసూలు చేసిన డబ్బు లేక లాభాన్ని నిషిద్ధంగా (హరామ్‌గా) పేర్కొనడం జరిగింది. [6]

ఇస్లామీయ చరిత్ర ప్రారంభ కాలం నుండే అప్పుదారులకు ఒడంబడిక ననుసరించి అసలుకన్నా అధికంగా చెల్లించవలసిన ధనాన్ని లేదా అప్పు చెల్లించే వ్యవధిని పొడిగించడానికి అసలుకన్నా అధికంగా ఇవ్వవలసిన డబ్బునే 'రిబా' (వడ్డీ)గా పేర్కొంటూ రావడం జరిగింది. [7] ఈ కారణంగానే, 'రిబా' (వడ్డీ) శీర్షికపై జరిగిన అనేక అంతర్జాతీయ ధార్మికవేత్తల సమావేశాల్లో, ప్రస్తుత కాలంలో బ్యాంకుల్లో ఇవ్వబడే Interest కూడా 'రిబా'గానే పరిగణించబడు తుందని ఏకగ్రీవంగా అంగీకరించడం జరిగింది. 1951లో ప్యారిస్‌లో, 1965లో కైరోలో జరిగిన కాన్ఫరెన్స్‌లు కానివ్వండి లేక Organisation of Islamic Conference (OIC) ఆధ్వర్యంలో 1985లో కైరోలో, రాబితయో ఆలమె ఇస్లామీ పర్యవేక్షణలో మక్కానగరంలో జరిగిన కాన్ఫరెన్స్‌లు కానివ్వండి, ప్రతిచోట ఇది ఏకగ్రీవంగానే అంగీకరించబడింది. [8] ఇంతపెద్ద స్థాయిలో, ఇస్లామీయ సమాజపు సామూహిక తీర్మానం తరువాత కొందరు వ్యక్తిగతంగా, దీనికి భిన్నంగా వ్యక్తపరిచే అభిప్రాయాలకు ధార్మికపరంగా ఎలాంటి విలువ ఉండదు. వారి ఈ అభిప్రాయం వడ్డీ నిషేధాన్ని తొలగించ జాలదు.

వడ్డీ నిషేధానికి సంబంధించి కొందరు తికమకపడడానికి కారణమేమి టనే ప్రశ్న ఉత్పన్నం కావచ్చు. బహుశా 'రిబా' అనే పదం షరీయత్‌లో రెండు విభిన్న అర్థాల కోసం ఉపయోగింపబడటమే దీనికి కారణమై ఉంటుంది. ఈ రెండింటి భావాన్ని, లక్ష్యాన్ని సరిగ్గా అర్థం చేసుకోకపోవడం వల్లనే ఈ చిక్కు

ఏర్పడే అవకాశముంటుంది. ఈ రెండు పదాల్లో మొదటిది, 'రిబా అన్నసీఅహ్', రెండవది, 'రిబా అల్ ఫజ్ల్'.

## రిబా అన్నసీఅహ్

'నసీఅహ్'కు మూలం నసాఅ; దీనికి అర్థం, వాయిదా వేయడం, ఆలస్యం చేయడం లేక నిరీక్షించడం. ఈ అర్థాలకు వివరణ ఏమిటంటే, అప్పిచ్చినవాడు, అప్పుతీసుకున్నవానికి వడ్డీకి బదులుగా అప్పుతీర్చడానికి ఇచ్చే గడువు లేక వ్యవధి. ఉదాహరణకు, ఒక సంవత్సరం తరువాత అప్పు తీర్చినట్లయితే, అసలుతో పాటుగా ఇంత ఎక్కువ డబ్బు చెల్లించాలి, లేక ఈ నిర్ణీత వ్యవధి దాటిన తరువాత వ్యవధిలో ఇంకనూ పొడిగింపు అవసరమైతే ఇంకెంత డబ్బు ఇవ్వాల్సి ఉంటుంది. ఈ విధంగా 'రిబాఅన్నసీఅహ్' నేటి కాలంలో అప్పుపై తీసుకోబడే 'వడ్డీ'తో సమానమైనది. ఖుర్ఆన్‌లోని బఖర సూర 275వ ఆయత్‌లో వచ్చిన, **"అల్లాహ్ వ్యాపారాన్ని ధర్మసమ్మతం (హలాల్) చేశాడు, వడ్డీని నిషిద్ధం (హరాం)చేశాడు"**లో 'రిబా' అనే పదం ఈ అర్థంతోనే ఉపయోగించబడింది. అందుకే ఈ 'రిబా'ను "రిబాఅల్ ఖుర్ఆన్" లేక "రిబా అద్దుయూన్" అని కూడా పిలుస్తారు. అంటే ఖుర్ఆన్‌లో వచ్చినటువంటి రిబా లేక అప్పులపై ఇవ్వాల్సిన రిబా.

"రిబాఅన్నసీఅహ్"కు అనివార్యమైన అర్థం ఏమిటంటే, అప్పిచ్చి తీర్చడానికి ఏదైతే గడువు ఇవ్వబడుతుందో, దానికి బదులుగా ఒక నిర్దిష్ట నిష్పత్తిలో కొంత ప్రతిఫలాన్ని తీసుకోవడం. ఈ ప్రతిఫలం లేక అధిక ధన నిష్పత్తి, తక్కువనా లేక ఎక్కువనా ( Interest or Usury ) అనేది అసందర్భం. ముందే నిర్ణయించబడిందా లేక మార్పు చెందుతుందా (Variable)? నగదుగా చెల్లింపబడు తుందా లేక కానుక రూపంలోనా లేక సేవా రూపంలోనా? అప్పు తీసుకునేటప్పుడే చెల్లించాలా లేక అప్పులు తీర్చేటప్పుడు చెల్లించాలా? ఇవన్నీ కూడా రిబా (వడ్డీ)కి మారు రూపాలే. అప్పుతీసుకున్నది స్వంత ఖర్చుల

(Consumption) కోసమా లేక వ్యాపారం, వాణిజ్య పరిశ్రమల ( Production) కోసమా అనేది అప్రస్తుతం.

ప్రవక్త మహనీయుల(స)కాలంలో పేదవారే తమ జీవితావసరాలను తీర్చుకోవడానికి అప్పులు తీసుకునేవారని, ఆ విధంగా వారి శోషణ జరుగుతుండేదని, అందుకనే వడ్డీ నిషేధించబడిందంటూ చేసే వాదన పూర్తిగా నిరాధారమైనది. ఇస్లాం పరిచయం చేసిన సంక్షేమ వ్యవస్థలో పేదవారి జీవితావసరాలు ఎలాంటి అప్పు తీసుకోకుండానే పూర్తయ్యేవనే విషయం నిరాకరించలేని వాస్తవం. ధనిక వర్గాలు అన్ని విధాలుగా వారికి సహాయమందించేవి. ఎవరైనా పేదవారి జీవితావసరాలు ఈ విధంగా పూర్తికాకపోతే "బైతుల్‌మాల్" (ఇస్లామీ ప్రభుత్వ ధనాగారం) ఉండనే ఉంది. ఆ నాటి ధర్మ సమాజంలో, ధనికులు పేదవారికి అందించే సహాయం దైవప్రసన్నత కోసం కాకుండా అప్పుగా ఇచ్చేవారని, అది కూడా వడ్డీపై ఇచ్చేవారంటే, అది ఊహాతీతమైన విషయం.

ఆ కాలంలో అప్పులు వ్యాపారం కోసమే తీసుకోబడేవి అనేది నిరాకరించలేని వాస్తవం. ఆ కాలంలో వర్తక బిడారులు వ్యాపార నిమిత్తం సుదూర దేశాలకు వెళ్ళేవి. తమ దేశంలో మిగులుబడిగా ఉన్న వస్తువుల్ని కొనుక్కొని, వాటిని విదేశాలలో అమ్మి, ఆ డబ్బుతో తమ దేశానికి అవసరమైన వస్తువుల్ని దిగుమతి చేసుకునేవారు. వ్యాపారంలో అత్యధిక ధనం మరియు సమయం వెచ్చించబడుతుండేది. ఒక దీర్ఘకాలం వరకు పెట్టుబడిగా పెట్టిన ధనం ఆగిపోతుండేది. ఇదే కాకుండా వాతావరణపు అననుకూల పరిస్థితులు, ప్రయాణ మార్గంలో ఇబ్బందులు దోపిడిమూకల దాడులు కూడా అత్యధికంగా ఉండి, ఆ కాలపు వ్యాపారం అత్యంత ప్రమాదాలతో కూడుకుని ఉండేది. ఒక వ్యాపారి ఇన్ని కష్టాల్ని ఓర్చి, లెక్కలేనన్ని ప్రమాదాల్ని ఎదుర్కొని వ్యాపారం చేస్తూ, అందులో ఏదైనా నష్టం సంభవిస్తే తానొక్కడే భరించడం, పెట్టుబడిదారు

కేవలం పెట్టుబడి పెట్టి, నిశ్చింతగా కూర్చుండిపోయి వ్యాపారి చేసిన వ్యాపారంలో నష్టం వచ్చినా కూడా తాను మాత్రం లాభమార్జించడం- ఇస్లామీయ న్యాయ దృక్పథానికి పూర్తిగా విరుద్ధమైన విషయం. అందుకే అది పెట్టుబడిదారును లాభనష్టాలు రెండింటిలో భాగం పంచుకోవడానికి కట్టడి చేసింది. అతను నష్టంలో భాగం పంచుకోనంటే, లాభంలో కూడా భాగం పంచుకోలేడు.

ఇరువయ్యో శతాబ్దానికి చెందిన ఒక ప్రఖ్యాత ధార్మికవేత్త షేఖ్ అబూజహ్రా ఇలా వ్రాశారు. **"ఇస్లాంకు పూర్వం, స్వంత అవసరాల కోసం తెచ్చుకునే అప్పులపై మాత్రమే రిబా (వడ్డీ) తీసుకోబడేదని, వ్యాపారం కోసం, ఉత్పత్తి కోసం తీసుకునే అప్పులపై కాదు అనటానికి చరిత్ర నుండి ఎలాంటి సాక్ష్యాధారాలు మనకు లభించవు."** చరిత్ర అధ్యయనంలో ఒక పరిశోధకునికి అప్పులకు సంబంధించి ఏ సాక్ష్యాధారాలు లభిస్తాయో, అవన్నీ ఉత్పత్తి కోసం తెచ్చుకున్నవే. ఆ కాలంనాటి అరబ్బుల పరిస్థితులు, మక్కా స్థావరము, ఖురైష్ వారి వ్యాపారం ఇవన్నీ కూడా అప్పులు కేవలం ఉత్పత్తి (వ్యాపార) లక్ష్యాల కోసమే తీసుకోబడేవని సాక్ష్యమిస్తాయి.[9] ప్రిస్టన్ యూనివర్శిటీలో మిడిల్ ఈస్టర్న్ స్టడీస్ డిపార్టుమెంట్ (Department of Middle Eastern Studies) ఛైర్మన్‌గా పనిచేసిన ప్రొఫెసర్ అబ్రహాం యుడోవిచ్ (Abraham Udovitch) కూడా ఈ విషయాన్ని ఇలా వివరించారు. **"మధ్యప్రాచ్యానికి సంబంధించి, ఆ కాలంలో అప్పులు కేవలం స్వంత అవసరాలను తీర్చుకోవడానికే తెచ్చుకోబడేవని, ఉత్పత్తి కోసం కాదని నిరూపించడానికి ఇవ్వబడే ఏ సాక్ష్యం లేక దృష్టాంతం ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాదు."**[10]

ఈ కారణంగానే ముస్లింలలోని అన్ని వర్గాల ధార్మికవేత్తలు, 'రిబా అన్నసీఅహ్'ను వడ్డీగానే గుర్తించారు. ఈ విషయంలో వీరంతా ఏకాభిప్రాయులై ఉన్నారు. ఈ విషయంలో వారిలో ఎలాంటి భేదాభిప్రాయం లేదు.

కనుక "రిబా అన్నసీఅహ్" అంటే ఖచ్చితంగా వడ్డీయే, ఇది నిషిద్ధం. ఈ నిషిద్ధం కఠినమైనది, ఖచ్చితమైనది మరియు అసందిగ్ధమైనదీను.[11] షరీయత్‌ను అనుసరించి పెట్టుబడిదారు లాభం మరియు నష్టం రెండింటిలోనూ పాలుపంచుకోవాలి, ఈ లాభనష్టాల పంపకం షరీయత్ ప్రతిపాదించే న్యాయసూత్రాల ఆధారంగానే జరగాలి.

## రిబా అల్ ఫజ్ల్

అప్పులపై తీసుకోబడే వడ్డీ "రిబా అన్నసీఅహ్" అయినట్లయితే, 'రిబా అల్‌ఫజ్ల్' దేన్నంటారు? అనే ప్రశ్న జనించడం సహజమే. దీనికి సమాధానం ఏమిటంటే, ఇస్లాం వడ్డీని నిషేధించి, వ్యాపారానికి అనుమతించింది. అయితే వ్యాపారంలో కూడా ప్రతి విషయానికీ అనుమతించలేదు. దీనికి కారణం ఏమిటంటే, వడ్డీ వ్యవస్థలోని అన్యాయాన్ని, దౌర్జన్యాన్ని మాత్రమే రూపుమాపటంతోనే ఇస్లాం ఊరుకుండదు, వ్యాపారంలో కూడా నిషేధిత మరియు అన్యాయపూర్వక పద్ధతుల ద్వారా లాభాన్ని గడించడాన్ని అది రూపుమాపదలుస్తుంది. వ్యాపార వస్తువులపై ఒక వ్యాపారి, మోసం, అవినీతితో తన ఎదురు వ్యాపారితో "అధికంగా" ఏదైతే దండుకుంటాడో దాన్నే "రిబా అల్ ఫజ్ల్" అంటారు. అరబి నిఘంటువు ప్రకారం, "రిబా"కు అర్థం "ఆధిక్యత, అధికం" అని వస్తుంది. అందుకని ఈ ఆయత్‌లో రిబాకు అర్థం ఎలాంటి ప్రతిఫలం లేకుండా, ఎలాంటి ఔచిత్యం లేకుండా తీసుకునే ఎక్కువ లేక అధికం"[12]

వ్యాపారంలో న్యాయాన్ని, నీతి నిజాయితీని అన్ని విధాలుగా నిశ్చయం చేయడమే 'రిబా అల్ ఫజ్ల్' నిషేధపు ముఖ్య ఉద్దేశ్యం. శోషణకు, అక్రమార్జనకు సంబంధించిన అన్ని పద్ధతుల్ని రూపుమాపదలుస్తుంది ఇస్లాం. దానితో పాటే రిబా (వడ్డీ)కి దారితీసే అన్ని దొడ్డిదారుల్ని మూసేస్తుంది. దీనికి కారణం

ఏమిటంటే, ఇస్లామీయ ఫిఖా (ధర్మశాస్త్రం) మౌలిక సూత్రాలను అనుసరించి నిషేధం వరకు చేర్చే ప్రతి విషయం, ప్రతి సాధనం, ప్రతి మార్గం కూడా నిషిద్ధమే. అనేకానేక పద్ధతుల్లో, రూపాల్లో ప్రజలు అన్యాయానికి, శోషణకు గురయ్యే అవకాశముంటుంది. వారిని మోసపుచ్చే సందర్భాలు వస్తాయి. అందుకనే **"ఒక ముస్లిం డెబ్బది (అంటే అనేక) రకాలుగా రిబా (వడ్డీ)తో కలుషితమయ్యే అవకాశముంటుందని"** ప్రవక్త మహనీయులు (స) హెచ్చరించారు.[13] ఈ కారణంగానే దైవప్రవక్త (స) ఇంకిలా ఉపదేశించారు. **"ఏ విషయపు అనుమతి గురించి మీకు అనుమానం వస్తుందో, దాన్ని వదిలేయండి, ఇంకా అనుమానానికి అతీతమైన పనినే చేయండి."**[14]

ఈ కారణంగానే హజ్రత్ ఉమర్ (రజి) ఇలా అన్నారు. "చిట్టచివరలో రిబా (వడ్డీ)కి సంబంధించిన ఆయత్ అవతరించింది. కాని ఈ 'రిబా'ను పూర్తిగా వివరించక ముందే ప్రవక్త మహనీయులు (స) పరమపదించారు. అందుకని మీరు కేవలం రిబా (వడ్డీ) నుండే కాదు; "రైబా" నుండి కూడా తమను తాము కాపాడుకోండి.[15]

"రైబా"కు మూలం రైబ్. ఈ రైబ్ అనే పదానికి అర్థం "శంక, అనుమానం" అవుతుంది. దీని భావం ఏమిటంటే, రిబా (వడ్డీ)ని పోలిన, ఆర్జన లేక రాబడి, ఇంకా అది అనుమతించబడిందేనా అనే విషయంలో శంక, అనుమానం వచ్చినప్పుడు వాటిని విడనాడండి. దీనివల్ల "రిబాఅన్నసీయహ్' అంటే ఏమిటో ప్రజల మనోమస్తిష్కాలకు అంతకుముందే పూర్తిగా అవగతమై ఉండేదని, దీని విషయంలో ఎలాంటి అనుమానం లేనేలేదని తేలిపోయింది. కాకపోతే "రిబా అల్ ఫజ్ల్" విషయంలో దాని వివిధ అంశాలను, రూపాలను, సంపూర్ణంగా విశదీకరించడం జరుగలేదు. అందుకనే ఆయనగారు అన్యాయం, దౌర్జన్యాలకు సమీపమనిపించే ప్రతీ విషయం నుండి దూరముండండని ఉపదేశించారు.

## 'రిబా అల్ ఫజ్ల్' ను పోలిన నాలుగు దృష్టాంతములు

### మొదటి దృష్టాంతము

ఒక మనిషి 'రిబా అల్ ఫజ్ల్'కు పాల్పడగలిగే నాలుగు వివిధ పద్ధతుల్ని ప్రవక్త మహనీయులు (స) ఉదాహరణలతో స్పష్టం చేశారు. వ్యాపారం ధర్మ సమ్మతమైనదైనప్పటికీ, అందులో అధర్మమైన, అక్రమమైన పద్ధతులు అవలంబించి శోషణ లేక అక్రమార్జన చేయడం. ఉదాహరణకు, ఆయన (స) గారు "గబన్ అల్‌ముస్‌తర్‌సిల్"ను కూడా వడ్డీతో పోల్చారు. గబన్ అనగా మోసం, ఇక ముస్తర్‌సిల్ అంటే అంగడి పరిస్థితులు, వస్తువుల ధరలు సరిగా తెలియని సామాన్య(అమాయక) వ్యక్తి. ఇలాంటి అమాయక వ్యక్తితో, అంగడిలో సామాన్యంగా నడుస్తున్న ధరల కంటే తక్కువ ధరకు అతని వస్తువును కొనడానికి, లేక సామాన్య ధరకన్నా అధిక ధరకు అతనికి అమ్మడానికి అనుమతి లేదు. ఈ రెండు సందర్భాల్లో కూడా అంగడి ధరకన్నా వ్యత్యాసంతో ఇచ్చినా, పుచ్చుకున్నా అది వడ్డీకిందికే వస్తుంది. ఇదేవిధంగా 'నాజిష్' (దూషింపబడిన వ్యక్తి)ని కూడా ఆయన (స) వడ్డీ తినేవానిగా నిర్ధారించారు.[17] వేలం సమయంలో వేలం వేసేవాడు ఒక ఏజంటును నియమించుకొని, అతని ద్వారా ధరను పెంచుతూ ఉంటాడు. అతన్నే నాజిష్ అంటారు. తద్వారా కొనుగోలుదారు మోసపోయి, వాస్తవమైన ధరకన్నా అధిక ధరను చెల్లిస్తాడు, ఆ విధంగా అతని పట్ల అన్యాయం జరుగుతుంది. ఈ హదీసుల (ప్రవక్త ప్రవచనాల) ద్వారా, మోసంతో, అంగడి ధరకన్నా తక్కువ ధరకు కొనడం, లేక అంగడి ధరకన్నా ఎక్కువ ధరకు అమ్మడం ద్వారా ఒక వ్యక్తి 'రిబా అల్‌ఫజ్ల్'కు పాల్పడతాడు. ఇక్కడ అప్పు ఇవ్వడం లేక తీసుకోవడం కాకుండా, కొనుగోలుకు, వ్యాపారానికి సంబంధించిన వ్యవహారమిది అనే విషయాన్ని మరచిపోరాదు. అంటే 'రిబా అల్‌ఫజ్ల్' అనేది వ్యాపారానికి సంబంధించిందే తప్ప 'రిబా అన్నసీఅహ్' లాగా అప్పుల వ్యవహారానికి సంబంధించింది కాదు.

## రెండవ దృష్టాంతము

ఒక వ్యక్తి, వేరొక వ్యక్తికై సిఫారసు (recommondation) చేస్తు నప్పుడు, సిఫారసు చేసే వ్యక్తి, దానికి ప్రతిఫలం పుచ్చుకోవడం ఈ 'రిబా అల్‌ఫజ్ల్' కు చెందిన రెండవ పద్ధతి. ప్రవక్త మహనీయులు (స) ఇలా ఉపదేశిం చారు. **"ఎవరైనా ఒక వ్యక్తి, తన తోటి ముస్లిం సోదరుని గురించి సిఫారసు చేసి, అతని నుండి ఏదైనా కానుకను స్వీకరించినట్లయితే, అతను రిబా (వడ్డీ) ద్వారములలో నుండి ఒక పెద్ద ద్వారంలో ప్రవేశించినట్లే."**[18] దీని అర్థం ఏమిటంటే, ఒక వ్యక్తి ఒక మంచి పనిని పుణ్యకార్యాన్ని, దైవ ప్రసన్నత కోసం కాకుండా ప్రపంచ లాభార్జన సంకల్పంతో చేస్తున్నాడన్నమాట. ఇలాంటి సిఫారసు (recommondation) వల్ల, తక్కువ అర్హత గల వ్యక్తికి లాభం చేకూరే, ఎక్కువ అర్హతగల వ్యక్తికి నష్టం వాటిల్లే అవకాశముంటుంది.

## మూడవ దృష్టాంతము

వస్తుమార్పిడికి సంబంధించిన వ్యాపారం, ఈ 'రిబా అల్ ఫజ్ల్'తో కలుషితమయ్యే మూడవ దృష్టాంతము. అంటే వస్తువుకు బదులు వస్తువుతో వ్యాపారం (Bartar)చేయడం. ఇలాంటి క్రయవిక్రయాల్లో అమ్ముతున్న లేక కొంటున్న వస్తువు విలువను సరిగ్గా అంచనా వేయడం అత్యంత కష్టమైన విషయం. అందుకోసమనే ఏ ఆర్థిక వ్యవస్థల్లోనైతే, డబ్బు, కరెన్సీ (currency) చెలామణిలో ఉందో, అక్కడ వస్తువుకు బదులు వస్తువుతో వ్యాపారాన్ని (Bartar) ప్రవక్త మహనీయులు (స) నిరసించారు. అమ్మదలచిన వస్తువును నగదు రూపాయలకు అమ్మి, ఆ డబ్బుతో అవసరమున్న వస్తువు కొనుక్కోవాలని ఆయన (స)గారు ఉపదేశించారు.[19]

## నాలుగవ దృష్ట్యాంతము

ఇక రిబా అల్‌ఫజ్ల్‌తో కలుషితమయ్యే నాలుగవ దృష్టాంతము. **ధార్మికవేత్తలు దీనిపైనే అత్యధిక శ్రద్ధ చూపారు. 'రిబా అల్ ఫజ్ల్' అంటే**

(కేవలం) ఇదే అని కొందరు అనుమానపడడానికి కారణం కూడా ఇదే. ఒకవేళ ఒకే రకానికి చెందిన వస్తువుల మార్పిడి చేసుకుంటున్నప్పుడు అనగా బంగారాన్ని బంగారంతో, వెండిని వెండితో మార్చుకుంటున్నప్పుడు రెండు షరతుల్ని పూర్తిచేయాలని అనేక హదీసుల్లో హెచ్చరించడం జరిగింది. మొదటి షరతు, ఈ రెండు వస్తువులు పరిమాణంలో లేక తూకంలో సమానంగా ఉండాలి. రెండవ షరతు, మార్పిడి వెనువెంటనే జరగాలి, అంటే ఈ చేత్తో ఇచ్చి, ఆ చేత్తో పుచ్చుకోవాలి.[20] కాని ఈ రెండు వస్తువులు తమ ఉనికిలోనే భిన్నత్వం కలిగి ఉంటే (ఉదాహరణకు రూపాయల్ని డాలర్లతో మార్చుకుంటున్నప్పుడు) వాటి తూకము లేక పరిమాణములో భిన్నత్వం ఉంటే ఫరవాలేదు, కాని వాటి మార్పిడి వెనువెంటనే, ఎలాంటి జాప్యం లేకుండా జరగడం మాత్రం అనివార్యం. ఈ రెండు షరతుల ముఖ్యఉద్దేశం కూడా వడ్డీకి సంబంధించిన దొడ్డిదారుల్ని మూసివేయడమే. ధార్మికవేత్తలు దీన్ని "సద్‌అల్‌జరియ" అనే పారిభాషిక పదంతో పేర్కొన్నారు. దీనికి అర్థం ఏమిటంటే, ఒక వ్యక్తి వంద రూపాయలు అమ్ముతున్నట్లయితే, బదులుగా వంద రూపాయలే స్వీకరించాలి. ఇంకా ఈ మార్పిడి వెనువెంటనే జరగాలి. ఒకవేళ జాప్యం జరిగినా కూడా వందకు బదులు వంద రూపాయలే స్వీకరించాలి. ఈ హదీసుల వల్ల ధార్మిక వేత్తలు గ్రహించిన ఇంకొక అర్థం ఏమిటంటే, విదేశీ కరెన్సీలో భవిష్య విక్రయాలు (Forward Transactions)జరుపడం నిషేధం. ఉదాహరణకు, మీరొకవేళ రూపాయలకు బదులు డాలర్లు కొనుగోలుచేస్తూ ఉంటే, ఈ విక్రయం వెంటనే (on the spot) జరగాలి. భవిష్యత్తు (Future)లో కాదు. అంటే మీరు రూపాయలు ఇప్పుడే చెల్లించి, అప్పుడే నిర్ణయించబడిన రేటుతో డాలర్లను భవిష్యత్తులో తీసుకోలేరు. రేటు మారిపోవడం వల్ల ఇద్దరిలో ఎవరికో ఒకరికి అన్యాయం జరుగుతుందనేది దీనికి కారణం. అయితే భవిష్యత్తులో డాలర్లు తీసుకుంటున్నప్పుడు ఏ రేటు ఉంటుందో, ఆ లెక్క ప్రకారం డాలర్లు తీసుకోవచ్చు.

విదేశీ కరెన్సీ మూల్యంలో ఏర్పడే హెచ్చుతగ్గుల వల్ల వచ్చే నష్టం నుండి రక్షణ కోసం చేయబడే హెజింగ్ (Hedging) కూడా నిషేధితమేనా అని ప్రశ్నించే అవకాశముంది. ఈ విషయంపై ధార్మికవేత్తలు దృష్టిసారించడం అవసరం. హెజింగ్ (Hedging)కు అనుమతి లేకపోతే ఎగుమతి, దిగుమతులు చేసుకునే వారు తీవ్ర నష్టాన్ని ఎదుర్కొనే అవకాశముంటుంది. ఉదాహరణకు, ఒక వ్యాపారి జపాన్ నుండి బట్టల్ని దిగుమతి చేయదలుస్తాడు, ఆ బట్టల ధర యెన్ (Yen)లో లేక డాలర్‌లలో ఆ సమయంలోనే నిర్ణయించబడుతుంది. కాని మూడు నెలల తరువాత ఆ బట్టలు అందినప్పుడు రూపాయల్లో దాని విలువ చెల్లించాల్సి ఉంటుంది. ఒకవేళ 'యన్' లేక డాలరు విలువ పెరిగిపోతే, అధికంగా ధరను చెల్లించాల్సి వస్తుంది. ఈ విధంగా వ్యాపారి తీవ్రంగా నష్టపోతాడు. ఇప్పుడే యన్ లేక డాలర్ కొనిపెట్టుకోవడానికి అతని వద్ద అంతడబ్బు లేదు. అందుకనే అతను భవిష్య వ్యాపారం చేస్తాడు. ఇది సమ్మతింపబడిందేనా? ధార్మికవేత్తల తీర్పు ఇంతవరకైతే లేదనే ఉంది. మారుతున్న పరిస్థితులననుసరించి ధార్మికవేత్తలు ఈ సమస్యను పరిష్కరించ డానికి సముచితమైన ధార్మిక పరిష్కారాన్నయినా సూచించాలి, లేకపోతే షరీయత్ వెలుగులో తీర్పుపై పునఃపరిశీలన జరపాలి.

'రిబా అన్నసీఅహ్", "రిబా అల్‌ఫజ్ల్" రెండు కూడా సూరె బఖరలో దైవం వ్యాపారాన్ని ఆమోదిస్తూ, రిబా (వడ్డీ)ను నిషేధిస్తూ జారీచేసిన ఆదేశాల ప్రతిరూపమే. "రిబా అన్నసీఅహ్" అనేది అప్పులు, వడ్డీకి సంబంధించినది. ఇక "రిబా అల్ ఫజ్ల్" వ్యాపారంతో సంబంధం కలిగి ఉంది. వ్యాపారం అనుమ తించబడిందంటే దాని అర్థం, అందులో ప్రతిదీ అనుమతించబడిందని కాదు. వడ్డీ మూలంగా ఎలా అన్యాయం జరుగుతుందో, అలాంటి అన్యాయమే వస్తువుల క్రయవిక్రయాల్లో వివిధ దేశాల కరెన్సీ మార్పిడిలో కూడా జరుగ వచ్చు. ఇలాంటి అన్యాయాన్ని, దౌర్జన్యాన్ని అరికట్టటానికే 'రిబాఅల్‌ఫజ్ల్" ద్వారా

నిషేధించడం జరిగింది. వస్తువుల ధరల్లో, తూనికల్లో, కొలతల్లో, ప్రామాణికతల్లో విదేశీ కరెన్సీల్లో జరిగే హెచ్చుతగ్గులు లేక అనిశ్చిత పరిస్థితి వల్ల ఏర్పడే అన్నిరకాల అవినీతి, అక్రమాలు దీని పరిధిలోకి వస్తాయి. ఏ వస్తువు మార్పిడి జరుగుతుందో దాని ప్రామాణికత, విలువ, అప్పగించబడే సమయం, తేదీ మొదలుగాగల విషయాల్ని కొనేవాడు, అమ్మేవాడు ఇద్దరూ క్షుణ్ణంగా తెలుసుకోగలగాలి, ఈ విధంగా ఇరుపక్షాల్లో ఎవ్వరు కూడా అన్యాయానికి గురికాకుండా రక్షింపబడాలి.[21]

'రిబా అన్నసీఅహ్'ను కొన్ని పదాల్లోనే వివరించవచ్చు, అయితే "రిబా అల్ ఫజ్ల్"ను వివరించడం అంత తేలికైన విషయంకాదు, ఇది వ్యాపారానికి సంబందించిన లెక్కించనలవిగాని వివిధ రూపాల్ని తనయందు ఇముడ్చుకొని ఉంటుంది. బహుశ ఈ కారణంగానే. "ప్రవక్త మహనీయులు (స) 'రిబా' (వడ్డీ)కి సంబంధించిన ఆయతును సంపూర్ణంగా వివరించకముందే పరమ పదించారు" అంటూ హజ్రత్ ఉమర్ (రజి) పరిస్థితిని అవగతమయ్యేలా వివరించారు. హజ్రత్ ఉమర్ (రజి) చెప్పిన ఈ మాటను వడ్డీకి అనుకూలంగా మలచే ప్రయత్నం చేయడం పూర్తిగా నిరాధారమైనది. ఆయన గారు పేర్కొన్నది 'రిబా అల్‌ఫజ్ల్' (వ్యాపారాలకు సంబంధించినదాని) గురించే గాని, 'రిబా అన్నసీయఅహ్' (అప్పుల)కు సంబంధించింది ఎంతమాత్రం కాదు, 'రిబా అల్‌ఫజ్ల్'కు సంబంధించి సంపూర్ణ వివరణ జరుగలేదు కనుక హాయిగా వడ్డీ తినవచ్చు అని ఆయనగారు చెప్పలేదే! దానికి బదులు ఒక ముస్లిం 'రిబా'తోనే కాదు, 'రైబా'తో కూడా దూరంగా ఉండాలని ఉపదేశించారు. అంటే 'రిబా' (వడ్డీ) ఎలాగూ నిషిద్ధమే, రైబా (వడ్డీ)తో పోలిన లేక 'రైబా'తో కలుషితం అయిందేమోనని అనుమానం వచ్చిన ప్రతీ ఆర్జనకు, ప్రతీ రాబడికి కూడా దూరంగా వుండాలనేదే ఆయన (రజి) అభిమతం.

'రిబా అల్‌ఫజ్ల్'తో కలుషితమయ్యే అన్ని పద్ధతుల్ని ప్రవక్త మహ

నీయులు (స) ఎందుకని తెలుపలేదు?అని ప్రశ్నించే అవకాశం ఇక్కడ ఎంతైనా ఉంది. దీనికి సమాధానమేమిటంటే దీని అవసరమూ లేదు, సంభవమూ కాదు. వ్యాపారం, కరెన్సీ మార్పిడిలలో అన్యాయం, అక్రమాలకు సంబంధించిన పద్ధతులు, కాలానుగుణంగా ఎంతగా మారుతున్నాయంటే, నేటికి 1400 సంవత్సరాలకు పూర్వం వీటన్నిటినీ గుర్తించి ఏకరువు పెట్టడం అసలు సంభవమయ్యే విషయం కాదు. దివ్యఖుర్‌ఆన్, సున్నత్ (ప్రవక్త గారి ఆచరణ)లు దీనికి సంబంధించిన మౌలిక సూత్రాలను ప్రతిపాదించాయి. వీటిని ఆధారంగా చేసుకుని ముస్లిం సముదాయం ప్రతి కాలంలోనూ తమ పరిస్థితుల ననుసరించి తమ కోసం ఒక సవివరమైన కార్యాచరణను రూపొందించుకోవచ్చు. ఖుర్‌ఆన్, సున్నత్‌ల పరిధిలో, వ్యాపారం చేసే, ధనాన్ని ఆర్జించే వివిధ పద్ధతుల్ని పరిశీలిస్తూ, అన్యాయ అక్రమాలకు, శోషణకు దారితీసే దొడ్డిదారులన్నిటినీ మూసివేయడం ముస్లింలందరి ఒక నిరంతర కర్తవ్యం. ఈ విధంగా చూస్తే 'రిబా అన్నసీయఅహ్' కన్నా 'రిబా అల్‌ఫజ్ల్'ను అరికట్టడం కష్టంతో కూడుకున్న పని. దీని కోసం దృఢ సంకల్పంతోపాటు, మొత్తం ఆర్థిక వ్యవస్థనే తిరిగి కొత్త పునాదులపై లేపడం, దాన్ని సంపూర్ణంగా సంస్కరించడం ఎంతో అవసరమవుతుంది. అప్పుడుగాని అన్యాయం, అక్రమాల్ని రూపుమాపి న్యాయం, నిజాయితీలను నిశ్చయం చేయగలుగుతాము. దివ్యఖుర్‌ఆన్‌ను అనుసరించి వివిధ ప్రవక్తలు (అలై) భువిలో ఉద్భవించడంలో గల మహోన్నత లక్ష్యం ఇదే!

**(సూర హదీద్, ఆయత్ 25)**

## చివరి మాట

వడ్డీ తినడం అంటే దైవం మరియు దైవప్రవక్త (స)తో యుద్ధం చేయడంతో సమానమైనది. ఇంత తీవ్రంగా, ఇంత కఠినంగా వడ్డీకి వ్యతిరేకంగా యుద్ధాన్ని ప్రకటించడానికి గల కారణమేమిటి? అన్నిరకాల అన్యాయ అక్రమాలను, శోషణల్ని తుదముట్టించే ఒక ఆర్థిక విధానాన్ని ఇస్లాం ప్రతిపాదించడమే దీనికి అసలు కారణం. ప్రత్యేకించి పెట్టుబడిదారు ఏమీ

కష్టపడకుండానే, నష్టంలో ఎలాంటి పాలుపంచుకోకుండానే, ఒక నిర్దిష్ట నిష్పత్తిలో ముందే లాభాన్ని నిర్ణయించుకోవడం, దీనికి భిన్నంగా వ్యాపారి తన వ్యవహార దక్షత, కఠినమైన శ్రమకు ఓర్చుకున్నప్పటికీ అనుకూలమైన లాభం వచ్చే గ్యారంటీకి నోచుకోకపోవడం, ఇలాంటి అన్యాయపూరితమైన లావాదేవీలను ఇస్లాం సహించదు. వ్యాపారికి లాభం, నష్టం రెండూ వచ్చే అవకాశమున్నప్పుడు పెట్టుబడిదారు కూడా ఈ రెండు విషయాల్లోనూ పాలు పంచుకోవాలి. ఈ విధంగా వ్యాపారి మరియు పెట్టుబడిదారు మధ్య న్యాయ ప్రదంగా వ్యవహారం జరుగాలి. ఇక వ్యాపారి, పెట్టుబడిదారును మోస గిస్తే అనే విషయానికి సంబంధించి, దీని నివారణ కోసం ప్రతి కాలంలోనూ వివిధ పద్ధతులు అవలంబించబడ్డాయి. నేడూ వాటిని అవలంబించవచ్చు. సమాజం సంపూర్ణంగా ప్రక్షాళనం చేయబడిన తరువాత గాని మనం ఇస్లామీయ వ్యవస్థ వైపు పురోగమిస్తామనడం నిరాధారమైన వాదన. ప్రపంచంలో ఎల్లప్పుడూ నిజాయితీపరులతోపాటు, అవినీతిపరులు, మోసగాళ్లు కూడా ఉంటూ వచ్చారు. ప్రజలు, సమాజం, ప్రభుత్వాలు కలసికట్టుగా అవినీతిని రూపుమాపటానికి వివిధ పద్ధతుల్ని అవలంబిస్తూ వచ్చాయి.

న్యాయం, నిజాయితీ మరియు సౌభ్రాతృత్వానికి ఇస్లాం ఎంతగా ప్రాధాన్యతనిస్తుందో, దాన్ని సరిగా అవగాహన చేసుకుంటే, ఇస్లామీయ సమాజంలో వడ్డీని అది ఎందుకంత కఠినంగా నిషేధించిందో అర్థమై పోతుంది. ఇస్లాం లక్ష్యాలేమిటో, దాని బోధనలేమిటో, ప్రత్యేకించి నీతినిజాయితీ లకు, న్యాయానికి అదెంతగా ప్రాముఖ్యాన్నిస్తుందో, రాబడి, ధనం న్యాయ ప్రదమైన పంపకమే దాని లక్ష్యమనే విషయాన్ని మనం విస్మరించినప్పుడే వడ్డీకి అనుకూలత ఏర్పడవచ్చు. వడ్డీ నిషేధాన్ని మనమొక మౌలిక విలువగా కాక అనుబంధ అంశంగా, చిన్న విషయంగా భావిస్తే ఇస్లాం ప్రతిపాదించే సామూహిక లక్ష్యాలతో, బోధనలతో దీనికెలాంటి సంబంధం లేదనుకుంటే, వడ్డీ నిషేధాన్ని, అందులో దాగి ఉన్న మర్మాల్ని మనమెప్పటికీ అర్థం చేసుకోలేము.

# మొదటి అధ్యాయపు పాద సూచికలు

1. వడ్డీ తినేవాణ్ణి, వడ్డీ ఇచ్చేవాణ్ణి, వడ్డీ ఒప్పందాన్ని వ్రాసేవాణ్ణి, ఈ వడ్డీ ఒప్పందంపై సాక్షులుగా సంతకం చేసే ఇద్దరు వ్యక్తుల్ని ప్రవక్త మహనీయులు (స) శపించారని, ఈ శాపంలో అందరూ సమానమేనని హజ్రత్ జాబిర్ (రజి) ఉల్లేఖించారు. (ముస్లిం, తిర్మిజి, అహ్మద్)

2. గతించిన తరువాత దైవదూతలు ఎవరికైతే స్నానం చేయించారో ఆ హజ్రత్ అబ్దుల్లా బిన్ హంజల (రజి) ఇలా ఉల్లేఖించారు.

   "తెలుసుండీ ఒక దిర్హం వడ్డీ తీసుకున్నా ముప్పది ఆరు పర్యాయాలు వ్యభిచారం చేసిన దానికన్నా తీవ్రమైనదని ప్రవక్త మహనీయులు (స) తెలిపారు."

   హజ్రత్ అబూహురైరా (రజి)ను అనుసరించి వడ్డీ (పాపానికి) డెబ్బై భాగాలున్నాయని, అందులోని అతిచిన్న భాగం ఒక వ్యక్తి తన తల్లితో వ్యభి చరించినంత (పాపమని) ప్రవక్త మహనీయులు (స) తెలిపారు. (ఇబ్నెమాజ, బైహఖిలోని షుఐబుల్ ఈమాన్)

3. 'రిబా' పదం అర్థం కోసం ప్రఖ్యాతిగాంచిన అరబీ నిఘంటువుల్ని చూడండి. ఉదాహరణకు ఇబ్నె మంజూర్ కృతి అయిన 'లిసానుల్ అరబ్' అజ్జుబేది రూపొందించిన "తాజుల్ ఉరూస్", రాగిబుల్ అస్ఫహాని రూపొందించిన "అల్ ముఫ్రిదాత్ ఫి గరీబుల్ ఖుర్ఆన్" లను పరిశీలించండి. ఖుర్ఆన్‌కు సంబంధించిన అన్ని వ్యాఖ్యానాల్లో కూడా మనకు ఇదే అర్థం లభిస్తుంది.

4. ప్రవక్త మహనీయులు (స) ఇలా బోధించారని హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) ఉల్లేఖించారు. "మీలో నుండి ఎవరైనా ఓ వ్యక్తి ఇంకొకరికి అప్పు ఇచ్చి నప్పుడు, అప్పు తీసుకున్న వ్యక్తి అప్పుకన్నా అధికంగా ఒక ప్లేటు భోజనం పెట్టినా స్వీకరించకూడదు, తన వాహనంపై ప్రయాణించమని కోరినా అది కూడా అంగీకరించకూడదు. ఇలాంటి వ్యవహారం (సన్నిహితం) అప్పుతీసు కోక పూర్వం నుండి కూడా వీరిద్దరి మధ్య జరుగుతూ వస్తుంటే తప్ప." (సనన్, బైహఖి)

   **హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) ఉల్లేఖనం ప్రకారం, మహాప్రవక్త (స) ఇలా**

ఉపదేశించారు: "ఎవరైనా ఓ వ్యక్తి, వేరొక వ్యక్తికి అప్పు ఇచ్చినట్లయితే, అతని నుండి (అప్పుగ్రహీత నుండి) ఎలాంటి కానుకను స్వీకరించకూడదు." (బుఖారి)

5. ఖర్తబి (ఖుర్ఆన్) వ్యాఖ్యానానుసారం ప్రవక్త మహనీయుల (స) చరిత్ర ఆధారంగా, "అప్పుతో పాటుగా, అధికంగా చెల్లించటమనేది, ఈ అధికం ఒక పిడికెడు మేత అయినా సరే, లేక ఇబ్నె మస్ఊద్ పేర్కొన్నట్లు ఒక్క ధాన్యపు గింజ అయినా సరే, వడ్డీగా పరిగణించబడుతుందనే విషయంలో ముస్లిం లందరూ ఏకాభిప్రాయులై ఉన్నారు." ఇబ్నె మంజూర్ రచించిన "లిసానుల్ అరబ్"ను అనుసరించి "అప్పు కన్నా అధికంగా ఏదైనా సొమ్ము లేక సేవను స్వీకరించినట్లయితే, అలాంటి ప్రతి అప్పు నిషేధితమైనదే". (ఖర్తబి వ్యాఖ్యానం - మూడవ ప్రచురణ 1967, దారుల్ కితాబుల్ అరబి, కైరో, సంపుటం-3, పేజీ-241

6. 'రిబా' అనే పదం కోసం ఇబ్నె మంజూర్ వ్రాసిన 'లిసానుల్ అరబ్' చూడండి. ఇదేకాకుండా బఖర సూరాలోని 275వ ఆయత్ వివరణ కోసం ఫఖ్రుద్దీన్ రాజీ రచించిన వ్యాఖ్యానం అల్‌కబీర్, అబూబకర్ జస్సాస్ వ్రాసిన అహ్‌కాముల్ ఖుర్ఆన్, ఇబ్నె అరబి వ్రాసిన 'అహ్‌కాముల్ ఖుర్ఆన్'లు కూడా చూడండి.

7. అల్‌జజీరి - సంపుటం-2, పేజీ -245 చూడండి.

8. దీని కోసం చూడండి, అల్‌సన్‌హోరి, 1953; సంపుటం-3, పేజీ. 241-246, అల్‌ఖర్జావి, 1994; పేజీ.129-142, దీనితోపాటే వడ్డీ నిషేధితం గురించి 1900 నుండి 1989 వరకు జారీ చేయబడిన ధార్మిక తీర్పుల (ఫత్వాల)తో కూడుకున్న అబ్దుల్ హమీద్ అల్‌గజాలి పుస్తకాన్ని చూడండి.

9. అబూజహ్‌రా, 1970. పేజీ. 53-54

10. యూడోవిచ్ (Yudo Vitch) 1970, పేజి. 86

11. అల్‌జజీరి, సంపుటం-2, పేజి. 245

12. 'రిబా'కు నిఘంటువు ప్రకారం అర్థం 'అధికం' లేక 'హెచ్చు'. దీని అర్థం ఏమిటంటే, ఎలాంటి బదులు (కారణం) లేకుండా ఇవ్వబడే సర్వవిధాల హెచ్చు లేక ఆధిక్యము (ఇబ్నెఅల్ అరబి, అహ్‌కాముల్ ఖుర్ఆన్, 1967, పేజి. 242)

13. రిబా (వడ్డీ)కు 70 భాగాలున్నాయి. వాటిలో అన్నిటికన్నా తక్కువ తీవ్రత గలది ఒక వ్యక్తి తన తల్లితో వ్యభిచరించడం. (ఇబ్నెమాజ, అల్‌బహేఖి– షుఐబుల్ ఈమాన్)

14. ఏ విషయం గురించైతే మీకు అనుమానం వేస్తుందో దాన్ని వదిలేసి అను మానానికి అతీతమైన దాన్ని ఎన్నుకోండి. (ఇబ్నెకసీర్ వ్యాఖ్యానంలో సూర బఖర, ఆయతు నెం. 275కు వివరణలో చూడండి)

15. అన్నిటికి చివరలో 'రిబా'కు సంబంధించిన ఆయత్ అవతరించింది, దీన్ని సంపూర్ణంగా విశదీకరించకముందే ప్రవక్త మహనీయులు (స) పరమ పదించారు. అందుకని మీరు రిబా (వడ్డీ)నే కాదు, రైబాను అను మానా స్పదాన్ని) కూడా విడిచిపెట్టండి. ప్రతి విషయంలో, అది అనుమతించ బడిందేనా అని శంక ఏర్పడినప్పుడు. (ఇబ్నెమాజ, దార్మి)

16. ముస్తర్‌సిల్ (అమాయక వ్యక్తి)ని మోసగించడం కూడా రిబా (వడ్డీ)యే (కన్‌జుల్ అమ్మల్, సంపుటం-4, పేజీ-42, లిఖితము -395హి.శ. బైహఖి, సుమూతిఫిల్ జామెవుల్ సగీర్ తహత్ కలిమతున్ గబన్)

17. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబిఔఫి ఇలా ఉల్లేఖించారు. "ప్రవక్త మహనీయులు (స) నాజిష్ (వేలం సమయంలో కొనుగోలుదార్లను మోసగించడానికి నిలబెట్టిన తన ఏజంట్)ను శపించబడిన, రిబా (వడ్డీ) తినేవానిగా పేర్కొ న్నారు" (ఫతహుల్‌బారి– ఇబ్నెహజర్ అస్ఖలాని, కితాబుల్ బయూమ్, బాబ్ అన్నజిష్, సయూతి-జామెవుస్సగీర్-తహత్ కలిమతున్ నజిష్)

18. హజ్రత్ ఉమామ (రజి) ఇలా ఉల్లేఖించారు:

"ఎవరైనా ఒక వ్యక్తి, తన సోదరుని కోసం సిఫారసు చేసి, ప్రతిఫలంగా కానుకను స్వీకరించినట్లయితే, అతను రిబా (వడ్డీ) ద్వారములలోని ఒక పెద్ద ద్వారంలో ప్రవేశించినట్లేనని ప్రవక్త మహనీయులు (స) హెచ్చరించారు. (అహ్మద్– అబూదావూద్, చూడండి, బులూగుల్ మరాం కితాబుల్ బుయూ, బాబుర్రిబా)

19. హజ్రత్ అబూ సయీద్ మరియు హజ్రత్ అబూహురైరా (రజి) ఇలా ఉల్లేఖించారు. "ఖైబర్‌లో ప్రవక్త మహనీయులు (స) ఒక వ్యక్తిని ఖర్జూరాలు తీసుకురమ్మని పంపారు. అతను జునేబ్ రకానికి చెందిన ఖర్జూరాలు తీసుకు వచ్చాడు. ఖైబర్ ప్రాంతంలోని ఖర్జూరాలన్నీ ఇలాగే ఉంటాయా? అని ప్రవక్త మహనీయులు (స) ఆ వ్యక్తిని ప్రశ్నించారు. "లేదు మహాప్రవక్తా! మేము ఒక సా (తూకము) ఖర్జూరాలకు బదులు రెండు సాలు, రెండు సాల ఖర్జూరాలకు బదులు మూడు సాలు తీసుకుంటాము" అంటూ సమాధానమిచ్చాడు. దానిపై ప్రవక్త మహనీయులు (స) ఇలా అన్నారు. 'అలా చేయకండి. ఖర్జూరాలన్నింటినీ దిర్హం (డబ్బు)లకు బదులు అమ్మేయండి, ఆ దిర్హంలతో జునేబ్ రకపు ఖర్జూరాల్ని కొనండి." (ముస్లిం, నిసాయి)

20. ఈ శీర్షికకు సంబంధించి అనేక హదీసులున్నాయి. వాటన్నిటినీ ఇక్కడ వ్రాయడం సులభంకాదు. ఈ హదీసుల కోసం రచయిత పుస్తకం 'నహూ నిజామ్ నఖ్ది ఆదిల్' Monetary System (Towards a just..1985 పేజి. 238-240. ఈ హదీసుల్లో ఈ క్రింది వస్తువుల ప్రస్తావన వచ్చింది. బంగారానికి బదులు బంగారం, వెండికి బదులు వెండి, గోధుమలకు బదులు గోధుమలు, యవలకు బదులు యవలు, ఖర్జూరాలకు బదులు ఖర్జూరాలు, ఉప్పుకు బదులు ఉప్పు.

21. వ్యాపారి మరియు కొనుగోలుదారు -ఇద్దరిలోనూ ఎవరికీ అన్యాయం జరుగ కూడదని షరీయత్ (ధర్మశాస్త్రం) అనేక రకాల విక్రయాల్ని నిషేధించింది. వాటిలో నుండి ఉదాహరణకు కొన్ని ఇవి. నజిష్-గబన్-అల్ ముస్తర్‌సిల్-బైవుల్‌హాజిర్ లిల్‌బారి-తలఖ్ఖి అర్రుక్బాన్-గరర్- ముహాఖల- మునాజజ, మలామస మరియు మజాబన- అల్‌జజీరి-సంపుటం-2, పేజి 273-278 మరియు 283-291 చూడండి.



# ౨. వడ్డీ ఎందుకు నిషిద్ధమయింది?

గత పుటలలోని వ్యాసంలో వడ్డీని, దైవం మరియు దైవ ప్రవక్త (స)కు వ్యతిరేకంగా యుద్ధంలాగా ఖుర్‌ఆన్ పరిగణించిందని, ప్రవక్త మహనీయులు (స) దీన్ని ముప్పది ఆరు పర్యాయాలు వ్యభిచారం చేసిన దానికన్నా, తన స్వంత తల్లితో వ్యభిచరించిన దానికన్నా అధిక పాపంగా పేర్కొన్నారని తెలుపుతూ వచ్చాము. అప్పు ఇచ్చిన తరువాత దానివల్ల ఏ చిన్న లాభం పొందడం లేక ప్రతిఫలాన్ని ఆశించడం కూడా ప్రవక్త మహనీయులు (స) నిషేధించారు. అయితే ఇక్కడో ప్రశ్న ఉత్పన్నమవుతుంది. వడ్డీకి సంబంధించి ఇస్లాం ఇంతటి కఠిన వైఖరిని, ఏ ఇతర నేరానికీ అవలంబించని తీవ్రవైఖరిని ఎందుకు అవలంబించింది? ఈ వ్యాసంలో దీనికి సమాధానం ఇవ్వడానికే ప్రయత్నించడం జరిగింది.

## ఇతర ధర్మాల్లో కూడా వడ్డీ నిషిద్ధమే

కేవలం ఇస్లామీయ ధర్మమొక్కటే వడ్డీని ఇంత కఠినంగా నిషేధించి ఉండలేదనే విషయాన్ని మనమిక్కడ గుర్తుంచుకోవాల్సి ఉంటుంది. హిందూ ధర్మం, యూదు మతం మరియు క్రైస్తవాలు కూడా వడ్డీని తీవ్రంగా నిరసించి, కఠినంగా నిషేధించాయి.[1] యూదుల పవిత్ర గ్రంథమైన 'తల్‌మూద్'లో వడ్డీ తినేవాణ్ణి, నేరంలో హంతకుడంతటి స్థాయిలో ఉంచటం జరిగింది. వారి ధార్మిక శాస్త్రమైన 'మిస్నా' వడ్డీ తినేవాణ్ణి, న్యాయస్థానంలో సాక్ష్యమివ్వడానికి

అనర్హునిగా నిర్ధారించింది.[2] క్రైస్తవుల ధార్మిక గ్రంథమైన బైబిల్‌లో వడ్డీ తినేవాణ్ణి, దౌర్జన్యపరునిగా పేర్కొనడం జరిగింది.[3] క్రీ.శ.1179లో జరిగిన వారి (క్రైస్తవుల) మూడవ లాటరన్ కౌన్సిల్, వడ్డీ తినేవారిని క్రైస్తవ పద్ధతిలో ఖననం కూడా చేయరాదని నిషేధించింది.[4] క్రైస్తవం అత్యధిక వడ్డీ (Usury-చక్రవడ్డీకి మించిన వడ్డీ) మరియు సామాన్య వడ్డీ (Interest)లో ఎలాంటి భేదాన్ని, భిన్నత్వాన్ని పాటించలేదన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. రెండూ కూడా ఒకే రకంగా నిషేధితమే.[5] (హిందూ ధర్మానికి సంబంధించిన మను స్మృతిలో కూడా వడ్డీ నిషేధించబడింది. మనువు వడ్డీ జీవితం ఆపదలందు జీవికగా చెబుతూ బ్రాహ్మణ, క్షత్రియులు మాత్రం ఆపదలందు సయితం వడ్డీకిచ్చి జీవనం చేయరాదని అన్నాడు (IV-200) మరోచోట 'నిష్కాహర్ధుషిక స్యాన్నం' (వడ్డీ వ్యాపారి అన్నం మలంతో సమానం అని పేర్కొన్నాడు. 'ధన వికేంద్రీకరణం' పుస్తకం నుండి-అనువాదకుడు). ఈ కారణాల వల్ల వడ్డీకి వ్యతిరేకంగా అన్ని ధర్మాలు ఎందుకని అంత కఠినవైఖరిని అవలంబించాయనే ప్రశ్న ఇంకా ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. దీనికి సముచితమైన కారణం ఏమై ఉంటుంది? ఒకవేళ దీనికి సముచితమైన, సమంజసమైన కారణం ఉండి ఉంటే, అది ప్రారంభ యుగాల్లో సముచితమైనట్లే, నేటి ఈ ఆధునిక యుగంలో కూడా అది సముచితమూ, సమంజసమూ అయి ఉంటుందా?

## కేవలం పేదవారే అప్పు తీసుకుంటారా?

ఎవరైతే వడ్డీ అపవిత్రతపై, నిషేధంపై అభ్యంతరం తెలుపుతారో, వారి వాదన ఏమిటంటే, ప్రాచీనకాలంలో వడ్డీ ద్వారా పేదవారిపై దౌర్జన్యం జరిగేది. వారు తమ ఆర్థిక బలహీనత కారణంగా అప్పు తీసుకోవడానికి వివశులై ఉండేవారు. అయితే అత్యధిక నిష్పత్తిలో వడ్డీ చెల్లించటం వల్ల వారు కోలుకో లేకపోయేవారు. ఈ కారణంగా వారు ఇంకా పేదరికపు రొంపిలో కూరుకు పోవడమే కాక, అప్పిచ్చే పెట్టుబడిదారు కబంధహస్తాల్లో బానిసలుగా

మారిపోయేవారు. అందుకనే ఈ ధర్మాలన్నీ కూడా వడ్డీని నిషేధితంగా ఘోషించాయి. ఈ వాదనను వినిపించి, వారు అనేదేమిటంటే ప్రస్తుత కాలంలో బ్యాంకులు ఇలాంటి శోషణకు పాల్పడడం లేదు.

గడిచిన వ్యాసంలో పేర్కొన్నట్లు, ఇస్లామీయ చరిత్ర ఈ వాదనను, ఈ దృష్టాంతాన్ని ఏ రకంగానూ సమర్థించదు. వడ్డీని సమర్థించే వారు ఇస్లామీయ చరిత్రను క్షుణ్ణంగా అధ్యయనం చేసినట్లు లేరు. వారేగనక ఇస్లామీయ చరిత్రను నిశితంగా అధ్యయనం చేసి ఉంటే, పేదల పరిస్థితిని మెరుగుపరచడానికి, వారిని వడ్డీతో కూడిన అప్పుల బాధ నుండి బయటపడవేయడానికి ఇస్లాం ఎలాంటి విప్లవాన్ని లేవదీసిందో తెలుసుకోగలిగేవారు. ప్రవక్త మహనీయుల(స) జీవితపు చివరి సంవత్సరాల్లో వడ్డీ నిషేధపు ఉత్తర్వులు కఠినంగా అమలులోకి వచ్చాయి. ఇస్లామీయ ప్రజా సంక్షేమ వ్యవస్థ సంపూర్ణంగా స్థాపించబడింది. పేద ప్రజలకు తమ జీవితావసరాలను పూర్తి చేసుకోవడానికి, వడ్డీతో కూడిన అప్పు తీసుకొని, పెట్టుబడిదారు కబంధ హస్తాల్లో ఇరుక్కునే అవకాశమే లేకుండా పోయింది. ఈ పేద ప్రజల అవసరాలు, ధనిక ప్రజలు చెల్లించే జకాత్ మరియు ఇతర దానధర్మాలు, వడ్డీరహిత అప్పులు మొదలుగాగల రూపాల్లో నెరవేరేవి. ఇవే కాకుండా బైతుల్‌మాల్ (ఇస్లామీయ ప్రభుత్వ ధనాగారం) ఈ పేద ప్రజల అవసరాలను తీర్చడానికి, వారిని ఆదుకోవడానికి సదా సంసిద్ధంగా ఉండేది. ఇదీ మనకు ఇస్లామీయ చరిత్ర తెలిపే వాస్తవాలు.

పేద ప్రజలు అప్పు తీసుకోకపోతే, ఇక అప్పు తీసుకునే వారెవరనే ప్రశ్న మీరడగవచ్చు. ఈ అప్పులు వ్యాపారులు తీసుకునేవారు. సమాజంలో, దేశంలో మిగిలిపోయిన వస్తువుల్ని ఎగుమతి చేయడానికి, జీవితానికి అవసరమైన వస్తువుల్ని దిగుమతి చేసుకోవడానికి వారు వర్తక బిడారులతో వ్యాపారం కోసం సుదూర ప్రదేశాలకు వెళుతుండేవారు. వ్యాపారం కోసం చేసే ఈ ప్రయాణాలు

ఎంతో కాలం పట్టేవి, అంతేకాకుండా అత్యధిక ధనం, పెట్టుబడి అవసరమై ఉండేది. ఈ వ్యాపారంలో వ్యాపారవేత్తకు లాభం, నష్టం రెండూ వచ్చే అవకాశ ముంటుండేది. పెట్టుబడిదారు కేవలం పెట్టుబడిని పెట్టి, వ్యాపార వ్యవహారాల్లో ఎలాంటి పాలుపంచుకోకుండా, ఒక నిర్ణీత నిష్పత్తిలో వడ్డీని రాబట్టుకోవడం, అటు వ్యాపారస్తుడు ఎన్నో ఒడుదుడుకులను ఓర్చి కూడా ఏదైనా నష్టం వస్తే ఒక్కడే భరించడం –ఇస్లామీయ న్యాయవ్యవస్థ దీన్ని గర్హించింది. అందుకనే అది వడ్డీని నిషేధించింది. పెట్టుబడిదారును లాభనష్టాలు రెండింటిలోనూ సమాన భాగస్వామిగా ఉండడాన్ని అనివార్యం చేసింది.

దీనివల్ల తేటతెల్లమయ్యిందేమిటంటే, కేవలం పేదల శోషణ కారణం గానే ఇస్లాం వడ్డీ వ్యవస్థను నిషేధించలేదు. అంతేకాదు, ఇస్లామీయ న్యాయ వ్యవస్థలో పేదల పరిస్థితిని మెరుగుపరచడానికి, వారికి న్యాయం చేకూర్చడానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది. ఖుర్‌ఆన్ సూచించే న్యాయవ్యవస్థను అనుసరించి శోషణకు గురిఅయిన ఇలాంటి పేదప్రజల పరిస్థితిని మెరుగుపరచడం ఒక్కటే కాదు, వారిని ఆదుకొని, నాయకత్వపు స్థాయి వరకు వారిని లేపాలనేది దాని ఉద్దేశ్యం.[6] పేదల సహాయార్థం ఇస్లాం తనదంటూ ఓ ప్రత్యేక సంక్షేమ వ్యవస్థను ఏర్పాటుచేసింది. దీని వివరాలు ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన పుస్తకాల్లో లభిస్తాయి. అందుకని దీని గురించి వివరాల్లోకి పోయే అవకాశ మిక్కడలేదు. ఇస్లాం కేవలం పేదల పరిస్థితిని మెరుగుపరచడం, వారిని ఆదుకో వడంతోనే సరిపుచ్చుకోదు, అంతకన్నా ముందుకెళ్లి జీవితంలోని అన్ని రంగాల్లో ధర్మం, న్యాయం తొణికిసలాడే ఒక అపూర్వ వ్యవస్థను ప్రతిపాది స్తుంది. తద్వారా అందరి సంక్షేమానికి గట్టి పునాదులు ఏర్పడతాయి. ప్రవక్తలు ఉద్భవిం చడానికి అన్నింటిలో కెల్లా పెద్ద కారణమిదే (అంటే సర్వమానవాళి సంక్షేమం) అని ఖుర్‌ఆన్ పేర్కొంటుంది. (సూరె అల్‌హదీద్ –25)

## వడ్డీ మరియు మానవాభ్యుదయం

ఇస్లాం న్యాయానికి సంబంధించిన బహుళమైన, బహుముఖమైన భావనలనిస్తుంది. అది కేవలం పేదల శోషణను అంతమొందించి లేదా పెట్టుబడిదారు– వర్తకుని మధ్య న్యాయం చేసి మిన్నకుండినంత మాత్రాన నెరవేరదు. భువిలో మనిషి దైవానికి ఉత్తరాధికారి. అందుకని ఆయన మానవునికి అమానతుగా ప్రసాదించిన సాధనాలు, వనరులన్నీ కూడా సర్వమానవుల సంక్షేమం, అభ్యుదయాల కోసం వినియోగించటానికి అవశ్య మైన పద్ధతులన్నిటినీ పాటించనంత వరకు ఇస్లాం ప్రతిపాదించే న్యాయం పరిపూర్ణం కాజాలదు. ఈ సాధనాలను, వనరుల్ని ఎంత సరళంగా, ఎంత పకడ్బందీగా, ఎంత సముచితంగా ఉపయోగించాలంటే, న్యాయంగా, మేలైన రీతిలో ఆర్థిక ప్రగతి ఎదుగుతూ పోవాలి. అప్పుడే ఇస్లాం కాంక్షించే న్యాయ స్థాయికి చేరుకోగలుగుతాము. దీనికోసం కనీసం ఈ క్రింద పేర్కొన్న నాలుగు లక్ష్యాల్ని సర్వసమాంతర (optimum) పద్ధతిలో సాధించడానికి గట్టి కృషి జరగాలి.

1. మానవులందరి జీవితావసరాలు పరిపూర్తి కావాలి.
2. ప్రజలందరికీ వారి యోగ్యతల ననుసరించి, జీవితావసరాలను తమ కష్టార్జితంతో పూర్తి చేసుకునేటట్లు గౌరవప్రదమైన ఆర్థిక వనరులు సమకూర్చబడాలి.
3. ఆర్జన మరియు ధనానికి సంబంధించి న్యాయవంతమైన పంపిణీ జరగాలి.
4. సంపద మరియు ఆర్థిక స్థితిలో స్థిరత్వం ఉండాలి.

పై లక్ష్యాలు నెరవేరాలంటే జీవిత వ్యవస్థలోని అన్నిరంగాలలో ప్రత్యేకించి ఆర్థిక వ్యవస్థ, దాని యుక్తులు పై లక్ష్యాలను సాధించేవిగా ఉండాలి. పై లక్ష్యాలకు ఆర్థిక వ్యవస్థలో ప్రాధాన్యత ఇవ్వనంత వరకు, వాటినే

ప్రాతిపదిగా చేసుకోనంతవరకు, ఈ లక్ష్యాల సాధన కోసం, యుక్తిగా, ఒక పాలసీగా, దైవం ప్రప్రథమంగా వడ్డీని నిషేధించాడు. ఈ కారణంగానే ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన ధర్మాలన్నీ కూడా వడ్డీని తీవ్రంగా నిరసించి నిషేధించాయి. పై లక్ష్యాలను సాధించడంలో వడ్డీతో కూడిన ఆర్థిక వ్యవస్థ ఎలా అడ్డంకిగా మారుతుందో మరియు వడ్డీరహితంగా ఏర్పాటు చేసే నూతన ఆర్థిక వ్యవస్థ, అప్పులపై ఆధారపడడాన్ని తగ్గించడం ద్వారా పై లక్ష్యాలకు చేరువకావడం ఎలా సులువవుతుందో తెలుపడమే ఈ వ్యాస ముఖ్య ఉద్దేశం.

## 1. జీవితావసరాల పరిపూర్ణత

బ్యాంకులు వడ్డీతో మిళితమైన అప్పులెవరికి ఇస్తాయి? తమ వద్ద అంగీకృతమైన, విశ్వసించదగిన ఆస్తి (collecteral) ఉందని, అంతేకాక అసలు అప్పును వడ్డీతో సహా సకాలంలో తీర్చటానికి తమ వద్ద ఆర్థిక వనరులున్నాయని, నగదు రూపంలో ఆదాయం (cash flow) తమ వద్ద ఎప్పుడూ ఉంటుందని బ్యాంకులకు నమ్మకం కలిగించే వారికే బ్యాంకు అప్పులు లభిస్తాయి. ఇక బ్యాంకులు ఇచ్చే ఈ అప్పు, ఏ లక్ష్యం కోసం వినియోగింప బడుతుందని పరిశీలించడమైతే జరుగుతుంది కాని దీనిని అంతగా పట్టించుకోవడం జరగదు. ఈ జమానతు కోసం చూపబడే ఆస్తి మరియు ఆదాయం– రెండూ కూడా అప్పు తీర్చడం కోసం అనివార్యం అయినప్పటికీ, ఈ రెండింటి పైనే అత్యధిక శ్రద్ధ చూపటం వల్ల, ఏ ఉద్దేశం కోసం ఈ అప్పు తీసుకోవడం జరుగుతున్నదో, వాస్తవంగా దాని కోసమే ఇది వినియో గింపబడుతున్నదా అనే విషయంలో శ్రద్ధ తగ్గిపోయింది. ఈ కారణంగానే బ్యాంకు అప్పులు సర్వసామాన్యంగా ధనికులకే ఎక్కువగా లభిస్తాయి. వారు విశ్వసించదగిన ఆస్తిపాస్తులూ చూపగలుగుతారు. తమ ఆదాయాన్ని ధృవీకరించగలుగుతారు.

ఈ రెండూ ధనికుల వద్దనే ఉంటాయి. లేదా ప్రభుత్వాలకు లభిస్తాయి. ప్రభుత్వాలు నష్టపోయి చేతులెత్తేయవని, అవి తన అప్పుల్ని వడ్డీతో సహా తీర్చుతాయని సర్వసామాన్యంగా భావించబడుతుంది. కనుక బ్యాంకు అప్పులు, ధనికులకూ, ప్రభుత్వాలకే పరిమితమైపోతున్నాయి.

ఇక ఇప్పుడు ధనికులు లేక ప్రభుత్వాలు ఏ ఉద్దేశంతో అప్పులు తీసుకుంటాయి అనేది ప్రశ్న. ధనికులు వారి అదనపు అవసరాల (consumption)కోసమో లేక పెట్టుబడి పెట్టడానికో అప్పు తీసుకుంటారు. వారు తీసుకునే ఈ అప్పు వారి జీవితావసరాల కోసం కాక, విలాస వస్తువులు కొనడానికి తీసుకుంటారు. ఇక ఏ అప్పులైతే వారు పెట్టుబడి (Investment) కోసం తీసుకుంటారో, అదంతా కూడా కేవలం ఉత్పత్తి లక్ష్యాల్లోనే వినియోగించటానికి కాకుండా, సట్టాల కోసం కూడా వినియోగిస్తుంటారు. ప్రభుత్వాలు కూడా తాము తీసుకునే అప్పులు అభివృద్ధి పథకాలు, ప్రజా సంక్షేమ కార్యక్రమాల్లోనే కాకుండా, అనవసరమైన ఆయుధాల కొనుగోలు, ఇంకా ఉత్పత్తేర ప్రణాళికలపై కూడా ఖర్చు పెడుతుంటాయి. ఈ విధంగా సమాజంలో మిగిలిపోయిన వనరులపై అవసరానికి మించిన భారం పడుతుంది. సమాజానికి సరిపడ వనరులేలేవు. దానిపై ధనికులు, ప్రభుత్వాలు అప్పులు తీసుకోవడం వల్ల వారిలో అత్యధికంగా ఖర్చుపెట్టే (living beyond means) మనస్తత్వం పుట్టుకొస్తుంది. దీనివల్ల జీవితావసరాలు పూర్తి చేసుకోవటానికీ, ఉత్పత్తి కోసం పెట్టుబడిని వినియో గించటానికీ వనరులు పరిమితమైపోతాయి. దీని ప్రభావం ఎవరి మీద పడుతుంది?

ధనికులైతే ఎలాగోలా తమ జీవితావసరాలను పూర్తి చేసుకుంటారు. కాని పేదలు? వారైతే నలిగిపోతారు. ఈ కారణంగానే అమెరికాలాంటి అభివృద్ధి చెందిన ధనిక దేశాలు సైతం, కోరికలున్నప్పటికీ, లెక్కలేనన్ని

వనరులన్నప్పటికీ, తమ పేద ప్రజల మౌలిక జీవితావసరాలను తీర్చడంలో విఫలమైపోతున్నాయి. అమెరికా అంతటి ఐశ్వర్యాన్ని, వనరుల్ని సమకూర్చుకున్నప్పటికీ, ప్రజల జీవితావసరాలను తీర్చడంలో విఫలమైపోతే, పాకిస్తాన్ లాంటి పేద ముస్లిం దేశాలు ఇస్లాం ప్రతిపాదించే సర్వమానవ సంక్షేమ లక్ష్యాన్ని ఎలా సాధించగలుగుతాయి?

ఇదేదో ఊహించుకొని చెబుతున్నది కాదు. మన కళ్లముందున్న వాస్తవం. వడ్డీతో కూడిన అప్పులు అవలీలగా లభిస్తుండడం వలన వివిధ ప్రభుత్వాలు ఈ అప్పులపై ఎంతగా ఆధారపడ్డాయంటే, ప్రెసిడెంట్ ముషర్రఫ్‌ను అనుసరించి దేశం మొత్తం బడ్జెట్‌లోని 66 శాతం వడ్డీ మరియు అసలును (debt servicing) తీర్చడంలోనే వినియోగించబడుతుందంటే పరిస్థితిని సునాయాసంగా అర్థం చేసుకోవచ్చు.[8] ఈ కారణంగానే రక్షణ, పరిపాలనా (administration) వ్యవస్థపై అయ్యే ఖర్చును తీసివేసిన తరువాత విద్య, రవాణా సౌకర్యాలు, ఆరోగ్యం, ఆర్థిక ప్రగతి, ఇతర ప్రజా సంక్షేమ పథకాలకై ప్రభుత్వం వద్ద మిగిలేది బహుకొద్ది మాత్రమే. ఫలితంగా ఇంకా అప్పులు తీసుకోవాల్సి వస్తుంది. ఈ విధంగా అప్పుల భారం విపరీతంగా పెరిగిపోవడం వల్ల, పేదరికాన్ని పారద్రోలడంలో, ఆర్థిక అసమానతలను రూపుమాపడంలో, దేశ ఆర్థిక ప్రగతిని పెంపొందించడంలో విఫలమవడమే కాక సంపన్న దేశాల కబంధ హస్తాల్లో నలిగిపోతున్నాము. అంతే కాకుండా బానిసల్లాగా వారి ప్రతి ఆదేశానికీ తలవొగ్గుతున్నాము. ప్రెసిడెంట్ ముషర్రఫ్ హయాంలో అప్పుల భారంలో కాస్త వెసులుబాటు కన్పించిందనటంలో పొరపాటు లేదు. కాని దీనికి కారణం, మన కృషి, ప్రయత్నాలు ఎంతమాత్రం కావు. అఫ్గనిస్తాన్ విషయంలో అమెరికాను సమర్థించిన కారణంగా ఆర్థిక సహాయం లభించింది, అప్పులు తీర్చే వ్యవధి కూడా పొడిగించబడింది

(rescheduling). ఇంకొక కారణం ఏమిటంటే, ప్రపంచమంతటిలో వడ్డీ రేటులో గణనీయంగా తగ్గుదల రావడం కారణంగా అది మనకెంతో లాభిం చింది. కాని తిరిగి ఎప్పుడైతే వడ్డీరేటు పెరిగిపోతుందో, పొడిగించిన అప్పులు తీర్చే వ్యవధి దగ్గరపడుతుందో, అప్పులు తీర్చడం అనివార్యమై పోతుందో, అప్పుడు రాబోయే ప్రభుత్వాలు గడ్డు పరిస్థితుల్ని ఎదుర్కొనక తప్పదు. ప్రత్యేకించి ఇస్లామీయ బోధనలననుసరించి, అప్పులపై ఆధారపడడాన్ని మనం విడనాడకపోతే, ఈ మహమ్మారి మనల్ని విడిచిపెట్టదు.

తూర్పు ఆసియా దేశాలు తీవ్రగతిన అభివృద్ధి చెందడానికి గల కారణాల్లో ఒకటి, వారి ధనికులు సామాన్య జీవితాన్ని అలవర్చుకున్నారు. వారి ప్రభుత్వాలు తమ జాతీయ, దేశీయ వనరుల్నే ఎక్కువగా వినియోగించు కున్నాయి, ఇంకా చాలా స్వల్పంగా అప్పులు తీసుకున్నాయి. ఈ విధంగా వారిపై అప్పుల భారం బహుతక్కువ పడింది. అభివృద్ధి కోసం వారు నిర్ణయిం చుకున్న ప్రణాళికలపై అధికంగా ఖర్చుపెట్టగలిగారు. పాకిస్తాన్‌లో ఏర్పడిన ప్రభుత్వాలు, ఇస్లామీయ బోధనల్నే గనక అమలుపరచి ఉంటే, అవి టాక్సు వ్యవస్థను ప్రక్షాళనం చేయటానికి వివశులై ఉండేవి. అనవసర ప్రణాళికలపై ఖర్చును తగ్గించుకోగలిగేవి. కాని ఈ రెండింటినీ కూడా చేయలేకపోయాయి. కారణం? టాక్సుల వ్యవస్థను సంస్కరించడం కన్నా, అప్పులు తీసుకుని ఖర్చు పెట్టడం వారికి సులభమనిపించింది. అనవసరమైన ప్రణాళికలపై పెద్ద పెద్ద పెట్టుబడులు పెట్టడం జరిగింది. ఇప్పుడు వాటినే అతి చౌకగా ప్రైవేటు సంస్థలకు అమ్మడం జరుగుతున్నది. ఈ విధంగా కొద్దోగొప్పో, వచ్చే ధనాన్ని అప్పుభారాన్ని తగ్గించడానికి మాత్రమే వినియోగిస్తే, కాస్త కంటి తుడువుగా నన్నా ఉంటుంది.

## 2. ఉద్యోగ అవకాశాలు

వడ్డీ వ్యవస్థ ప్రజలకు, ప్రభుత్వాలకూ తమ స్థాయికన్నా అధికంగా ఖర్చుపెట్టే మనస్తత్వాన్ని పురిగొల్పుతుంది. ఈ కారణంగానే ప్రపంచంలోని అన్ని దేశాల్లో పొదుపు (savings)లో తగ్గింపు వచ్చింది. గడిచిన శతాబ్దపు చివరి చతుర్థంలో, ప్రపంచంలోని అన్ని దేశాల్లో దేశీయ, జాతీయ పొదుపులు (Savings)1971లో 26.6 ఉంటే 1998లో 22.3శాతానికి పడిపోయింది. పారిశ్రామిక దేశాల పొదుపులు 23.6 నుండి 21.6కు పడిపోయాయి. ద్రవ్యోల్బణం మరియు అప్పులు తీర్చే సామర్థ్యంలో పెరుగుదల రాకపోయినప్పటికీ, అభివృద్ధి వేగాన్ని తీవ్రతరం చేయడానికి, పొదుపుల్ని పెంచే అత్యంతావశ్యకత ఉన్న వర్ధమాన దేశాల్లో సైతం ఈ పొదుపులు 34.2 నుండి 26.0కు పడిపోయాయి.[9] పొదుపుల్లో ఇంతగా దిగజారిపోవడానికి ఎన్నో కారణాలున్నాయి. అందులో ఒక అతిముఖ్య కారణం, ప్రభుత్వ మరియు ప్రైవేటు సెక్టార్లలో ఉత్పత్తేతర రంగాలపై అత్యధికంగా ఖర్చుకావడం -వడ్డీ వ్యవస్థలో ఇలాంటి విషయాలకు వృద్ధి వికాసాలు లభించడం సహజమే.

ఈ కారణంగా వాస్తవ వడ్డీరేటు (real rate of interest)లో పురోగమనం, సామూహిక పెట్టుబడిలో తగ్గుదల వచ్చేసింది. ఇదీ, ఇంకా దీనితో పాటు ఇతర సామాజిక, ఆర్థిక మరియు రాజకీయ ఆటంకాల (structural rigidities)తో కలిసి, అవసరానికి సరిపడ నిష్పత్తిలో ఉద్యోగావకాశాలను పెరగకుండా చేశాయి. ఈ విధంగా అవి ధనిక దేశాలైనా, పేద దేశాలైనా, ప్రపంచ దేశాలన్నిటిలో నిరుద్యోగం ఒక పరిష్కరించనలవిగాని సమస్యగా నిలిచిపోయింది. యూరోపియన్ యూనియన్‌లో నిరుద్యోగ సరాసరి నిష్పత్తి 1971లో 2.9 శాతం ఉంటే, అది 1999 వచ్చేసరికి దాదాపుగా మూడింతలు పెరిగిపోయి 9.2శాతానికి చేరుకుంది.[10] సమీప భవిష్యత్తులో ఈ దేశాల్లో

నిరుద్యోగ నిష్పత్తిలో చెప్పుకోదగ్గ తగ్గింపు వచ్చే అవకాశాలు లేవు. నిరుద్యోగాన్ని తగ్గించడానికి అనివార్యంగా భావించబడే ఆర్థికాభివృద్ధి వాస్తవిక నిష్పత్తి (real rate of economic growth) ఈ దేశాల్లో శాశ్వతంగా తగ్గిపోయింది. యువకుల్లో పెరిగిపోతున్న నిరుద్యోగ నిష్పత్తి వీటన్నిటిలో అత్యంత ఆందోళన కలిగించే విషయం. దీనివల్ల వీరి ఆత్మాభిమానం దెబ్బతింటుంది. భవిష్యత్తుపై విశ్వాసం బలహీనబడిపోతుంది. సమాజం పట్ల ద్వేషం పెరిగిపోతుంది. వారి యోగ్యత లకు, ఉత్పత్తి సామర్థ్యానికి గుర్తింపు తగ్గిపోతుంది.

అమెరికాలో దేశీయ, ఆంతరంగిక పొదుపుల్లో తగ్గుదల మాత్రమే కాదు, అది శూన్యస్థాయికి పడిపోయినప్పటికీ, అక్కడ ఆర్థికాభివృద్ధి వేగం పుంజు కోవడానికి, నిరుద్యోగం అత్యంత తక్కువగా ఉండడానికి కారణ మేమిటనే ప్రశ్న జనించే అవకాశముంది. దీనికి ఎన్నో కారణాలున్నాయి. అన్నిటిలో పెద్దది, ప్రముఖ కారణం, అమెరికాలో విదేశీ పొదుపుల ప్రవాహం (flow) అధికంగా ఉంది. దీనివల్ల పెట్టుబడుల్లో గణనీయమైన పెరుగుదల వచ్చింది.[11] ఏ కారణం వల్లనైనా ఈ విదేశీయ పెట్టుబడులు లేక పొదుపులు తిరిగివెళ్లిపోనారంభిస్తే, లేదా వాటి ఆంతరంగిక ప్రవాహంలో తగ్గుదల వస్తే, ఇప్పుడున్న ఆర్థికాభివృద్ధి మరియు ఉద్యోగ అవకాశాలను కాపాడడం దుర్లభమై పోతుంది. ఒకవేళ ఈ కారణంగా డాలర్ ఎక్స్చేంజ్ రేటులో (exchange rate)పేర్కొనదగిన క్షీణతవస్తే, ప్రపంచంలో డాలర్ విలువకు హానికలిగితే, ప్రపంచ ఆర్థిక వ్యవస్థ (financial system) తీవ్రమైన సంక్షోభాన్ని ఎదుర్కోవలసి వస్తుంది. 1971లో డాలర్ విలువలో క్షీణత (devaluation) రావడానికి పూర్వమూ ఆ తరువాతనూ ఏర్పడిన సంక్షోభం లాంటిదే తిరిగి ఎదుర్కో వలసిరావచ్చు.

సట్టా వ్యాపారాన్ని(Speculation), అనవసరపు ఖర్చుల్ని తగ్గించుకొని,

పొదుపుల్లో అభివృద్ధి చేసుకొని జాతీయ ఆర్థిక రంగంలో ఎంతో సహాయం అందించవచ్చు. కాని ప్రభుత్వాలు, ప్రైవేటు రంగాలు తమ వనరులకు మించి, ఉత్పాదనేతర ఖర్చులను తగ్గించుకోనంత వరకు దీనివల్ల ఎలాంటి లాభము ఉండదు. వడ్డీ ప్రాతిపదికపై (పునాదులపై) ఏర్పడిన ఈ ఆర్థిక వ్యవస్థ, ఉత్పాదనేతర ఖర్చుల కోసం అవలీలగా అప్పులను జారీచేస్తూ ఇలాంటి జీవన విధానం సాధ్యమవడానికి సహాయకారిగా మారుతున్నది. దీనికి భిన్నంగా బ్యాంకులు సమకూర్చే పెట్టుబడుల లాభనష్టాల్లో వాటిని సమాన భాగస్వాములుగా చేసి, ఇంకా అప్పులు కేవలం వాస్తవమైన సరుకులు మరియు సేవల (real goods and services) ఉత్పత్తి కోసమే జారీ చేయబడి నట్లయితే ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థ దీన్ని నిశ్చయం చేసుకున్నట్లు. ఫలితంగా బ్యాంకులు అప్పులు జారీ చేయడంలో అత్యధిక జాగ్రత్త వహిస్తాయి. అంతే కాకుండా ఇలాంటి అప్పుల్లో పెరుగుదల వస్తూ ఉంటే అదే నిష్పత్తిలో ఆర్థిక అభివృద్ధిలో కూడా పెరుగుదల వస్తూ ఉంటుంది. ఉత్పాదనేతర, సట్టా వ్యాపారం (Sepeculation) కారణంగా వచ్చే ఖర్చులు క్రమంగా తగ్గిపోతాయి. ఉత్పత్తికి అవసరమైన పెట్టుబడులు మరియు జీవితావసరాలు తీర్చటానికి అధిక వనరులు సమకూరుతాయి. దీనితో అభివృద్ధి రేటు వేగవంతమై పోతుంది.

## 3. న్యాయప్రదంగా ధన పంపకం

వడ్డీ ప్రాతిపదికపై ఏర్పడి, ప్రస్తుతం చలామణిలో ఉన్న ఆర్థిక వ్యవస్థలో ఆర్థిక వనరుల న్యాయమైన పంపకం జరుగడం లేదన్న విషయం ఇప్పుడు సర్వత్రా అంగీకరించబడుతున్నది. ఆర్నీబిగిస్టన్ (Arne Bigsten)ను అనుసరించి, పెట్టుబడి (లేక సంపద) పంపకం, భూమి పంపకం కన్నా కూడా అత్యంత అసమానంగా ఉంది. ఇంకా "బ్యాంకుల వ్యవస్థ, ధనపు అసమాన

పంపకాన్ని ఇంకను సుదృఢం చేస్తున్నది."[12] దీనికి అసలు కారణం ఏమిటో ముందే వివరించటం జరిగింది. వడ్డీ ప్రాతిపదికగా ఏర్పడిన ఆర్థిక వ్యవస్థ, అప్పుతీర్చే స్థోమత (collateral)పై, గ్యారంటీపై అత్యధికంగా ఆధారపడు తుంది. ప్రణాళిక ప్రయోజనంపైగాని, లేక అప్పుగా తీసుకొనబడే ధనం వినియోగంపైగాని, ఎంతగా శ్రద్ధ వహించాలో, అంతగా పట్టించుకోవడం జరగదు. ఈ కారణంగానే సమాజంలోని లెక్కలేనంత మంది బ్యాంకుల్లో జమచేసుకున్న డబ్బుతో కేవలం కొంతమంది ధనికులు మాత్రమే లాభపడ గలుగుతున్నారు. అందుకే ఈ విషయాన్ని మీషాన్ (Mishan) ఎంతో చక్కగా వర్ణించాడు. **"ధన పంపకంలో అత్యంత భేదభావముంది. అప్పిచ్చే వాడు, సమాజంలోని ధనిక వర్గాలకే కాకుండా పేద ప్రజలకు కూడా అప్పివ్వడానికి సిద్ధపడడం సమంజసం కాదా? కనీసం వీరిద్దరికీ ఒకే విధమైన షరతులపైనైనా అప్పివ్వాలి కదా!"**[13]

"ఇలాంటి బ్యాంకుల వ్యవస్థ" పటిష్ఠమైన చిన్న కంపెనీలకు, లేక ధైర్యంగల ఆన్వేషక పెట్టుబడిదారులకు (venture capitalists) పెట్టుబడుల్ని సమకూర్చడంలో విఫలమైందని అమెరికాకు చెందిన పెద్ద బ్యాంకుల్లో ఒకటైన Morgan Guarantee Trust Company అంగీకరించింది. **"వీరి వద్ద (బ్యాంకుల వద్ద) అత్యధిక ధనం ఉన్నప్పటికీ, అవి గొప్ప ధనికులకు, అత్యధిక నగదు కలిగి ఉన్న కంపెనీలకు తప్ప, ఆమోదయోగ్యమైన వడ్డీరేటుపై ఇంకె వరికీ పెట్టుబడిని సమకూర్చడానికి సంసిద్ధంగా లేవు."**[14]

దీనికి భిన్నంగా లాభనష్టాల్లో సమాన భాగస్వామ్యం కలిగి ఉండే వ్యవస్థ న్యాయాన్ని అందివ్వడంలో అనుకూల పరిస్థితుల్ని కల్పిస్తుంది. ఈ వ్యవస్థలో పెట్టుబడిని సమకూర్చేవాడు, ప్రణాళిక ప్రయోజనకరాన్ని అది లాభాన్విత మయ్యే విషయాన్ని శ్రద్ధాసక్తులతో పరీక్షించడానికి వివశుడవుతాడు. దీని

ఫలితంగా పేద, మధ్య తరగతికి చెందిన యోగ్యులైన వ్యాపారులు కూడా లాభపడడానికి అవకాశాలు పెరిగిపోతాయి. వారి వద్ద లాభదాయకమైన ప్రణాళిక ఉంటే, వారిలో కావలసిన వ్యవహార దక్షత ఉంటే, వారు సమాజంలో విశ్వాసపాత్రులు, నిజాయితీపరులుగా గుర్తింపబడుతూ ఉంటే, తమ ప్రణాళికను క్రియారూపంలో ప్రారంభించటానికి కావలసిన పెట్టుబడి వారు పొందగలుగుతారు. దీని ఫలితంగా పేద మరియు మధ్యతరగతి వ్యాపారుల యోగ్యతలతో సమాజం కూడా లాభపడగలుగుతుంది. ఈ రకంగా ఇలాంటి వ్యాపారులు సమాజంలో ఉద్యోగావకాశాలు పెంచడానికీ, సమాజ అవసరాలు తీర్చడానికీ ప్రముఖపాత్ర వహించగలుగుతారు.

వడ్డీరహిత పెట్టుబడి వ్యవస్థలో అప్పులు తిరిగిరానందువల్ల ఏర్పడే నష్టం గురించి అత్యధికంగా చింతించనవసరం లేదు. మొత్తం ప్రపంచంలో ఈ విషయానికి సంబంధించి ఏ అనుభవాలైతే దృష్టిలోకి వచ్చాయో, అవెంతో సంతృప్తి కలిగించేవిగా ఉన్నాయి. పేద మరియు మధ్యతరగతికి చెందిన ప్రజలు దాదాపుగా నిజాయితీపరులుగానే తేలారు. అప్పు తీసుకుని, దాన్ని తీర్చే సంకల్పమేలేని కాలానువర్తనులు, నియమ నిబంధనల్ని తుంగలో తొక్కే ధనికుల్లాంటి వ్యక్తులు కారు వీరు. అప్పులు తీసుకున్న ఈ ధనిక వర్గాలు లంచాలు ఇచ్చి లేదా రాజకీయ పలుకుబడిని ఉపయోగించి, తమ అప్పుల్ని మాఫీ చేయించుకుంటారు. వ్యవసాయ అభివృద్ధి కోసం ఇవ్వబడే అంతర్జాతీయ నిధి (IFAD-International Fund for Agricultural Development) ద్వారా పేద మరియు యోగ్యులైన ప్రజలకు ఇవ్వబడిన అప్పులు, వారు తమ ఆదాయం మెరుగుపడగానే, తొందరలోనే తీర్చివేశారని అనుభవపూర్వకంగా నిరూపితమయింది.[15] చిన్న అప్పుల కార్యక్రమాలు (Micro credit programmes) ఎన్నో

దేశాల్లో సత్ఫలితాలను ఇచ్చినట్లు బయల్పడింది. దీన్ని ఆధారంగా చేసుకుని, చిన్న అప్పులు తీర్చడం కోసం లాభదాయకమైన, అనుభవ పూర్వకమైన పద్ధతుల్ని రుణ వసూళ్లలో అవలంబించకూడదని మా ఉద్దేశం కాదు. అంతే కాకుండా ఈ వసూళ్ల కోసం ప్రపంచంలో అనేక పద్ధతులు అవలంబించ బడ్డాయి. అప్పుల ఇన్సూరెన్స్ కూడా అందులో ఒకటి.

పాకిస్తాన్, ఇతర వర్ధమాన దేశాల్లోని బ్యాంకుల వ్యవస్థ, జాతి సంపద నంతా కొందరి చేతుల్లోనే జమ చేసే అతిగొప్ప సాధనంగా మారడం విషాదకర మైన విషయం. 1994లో లక్ష రూపాయల కన్నా తక్కువ విలువ కలిగిన డిపాజిటుదార్లు, బ్యాంక్ మొత్తం ఖాతాల్లోని 42.9 శాతం ధనాన్ని బ్యాంకుల్లో జమచేశారు. అయితే లక్ష రూపాయల కన్నా తక్కువ పరిమాణంలో అప్పులు పొందినవారు, బ్యాంక్ జారీచేసిన మొత్తం అప్పుల్లో కేవలం 4.3 శాతం మాత్రమే అప్పుగా పొందగలిగారు.[16] వేరొక వైపు కోటి రూపాయలు లేక అంతకు మించిన డబ్బును జమచేయగలిగే ఖాతాదార్లు, బ్యాంకు మొత్తం ఖాతాల్లో కేవలం 14.7 శాతం ధనాన్ని మాత్రమే జమచేశారు. కాని బ్యాంకు జారీచేసిన అప్పుల్లో వారు 55.6 శాతం పొందగలిగారు. ఇంతకన్నా కూడా విచారించదగ్గ ఇంకొక విషయం ఏమిటంటే, 28.4 మిలియన్ల (28 కోట్ల 40 లక్షల) డిపాజిటుదార్లు ఏ ధనాన్నయితే సమకూర్చిపెట్టారో, దానిలోని 55.6 శాతం కేవలం 4703 మంది అప్పు తీసుకునే వారికి జారీ చేయడం జరిగింది. ఇలాంటి బ్యాంకుల వ్యవస్థ ధనాన్ని కేంద్రీకృతం చేయడానికైతే దోహద పడుతుందేమో గాని, ఇస్లాం ప్రతిపాదించే న్యాయప్రదమైన ధన పంపకాన్ని, ధన వికేంద్రీకరణాన్ని ఎన్నటికీ సాధించజాలదు.[17] 1992లో చేసిన చట్టాల సవరణలు కూడా పెద్ద మార్పును, ప్రయోజనాన్ని కలిగిస్తాయని ఆశించలేము.

## 4. ఆర్థిక సుస్థిరత

మనకు సుపరిచితమైన అనేక కారణాల వల్ల మానవ చరిత్రలో ఆర్థిక ఒడిదుడుకులు వస్తూనే ఉంటాయి. ఇందులో ఒక ముఖ్య కారణం, ప్రకృతి వైపరీత్యాలు (Natural phenomena), ఉదాహరణకు, అనావృష్టి, వరదలు, భూకంపాలు -ఇలాంటి ఆపదల్ని మానవుడు కట్టడి చేయడం ఇంతవరకు అసాధ్యంగానే ఉంది. ఇవి కాక, గడిచిన మూడు దశకాల్లో, ప్రపంచంలోని ఆర్థిక మార్కెట్లలో (Financial markets) తీవ్ర సంక్షోభం ఏర్పడింది. దానివల్ల ఆర్థిక అస్థిరత్వంలో, అనిశ్చితల్లో తీవ్రమైన పెరుగుదల వచ్చింది. దీనికి కూడా ఎన్నో కారణాలున్నాయి. కాని నోబుల్ బహుమతి గ్రహీత అయిన ఆర్థిక నిపుణుడు Milton Friedmanను అనుసరించి, వడ్డీ రేటులో అసామాన్యమైన ఎగుడుదిగుళ్లు (Votality) దీనికి అతిపెద్ద కారణం.[18] ఈ ఎగుడుదిగుళ్ళ కారణంగా పెట్టుబడుల మార్కెట్లలో తీవ్రమైన అనిశ్చిత పరిస్థితి ఏర్పడింది. దీనివల్ల వ్యాపారులు పూర్తి విశ్వాసంతో దీర్ఘకాల పెట్టుబడుల గురించి ఆలోచించడం కష్టతరమైపోయింది. ఇంకా అప్పులు ఇచ్చేవారు, పుచ్చుకునే వారు, ఇద్దరూ కూడా అధిక నష్టాల నుండి తమను తాము కాపాడుకోవటానికి స్వల్పకాలిక రుణాలపై అత్యధికంగా ఆధారపడుతున్నారు. ఈ కారణంగానే స్వంత ధనం ఆధారంగా పెట్టుబడి (Equity)పెట్టడానికి బదులు స్వల్పకాలిక రుణాలను ఆధారంగా చేసుకొని పెట్టుబడి పెట్టే నిష్పత్తి అనగా లివరేజ్ (Liverage) బాగా పెరిగిపోయింది.[19] కాని లివరేజ్ ఎంతగా పెరిగిపోతుందో, అంత ఎక్కువగా ఆస్తుల విలువల్లో ఏదో ఒక కారణంగా తగ్గింపు రావడం వలన అప్పుల్ని తీర్చడం దుర్లభమైపోతుంది. ఇంకా ఆర్థిక సంక్షోభం తీవ్రమై పోతుంది.

స్వల్పకాలిక అప్పుల్లో పెరుగుదల వల్ల ఆర్థిక రంగాల్లో అస్థిరత

ఎందుకు పెరిగిపోతుందనే ప్రశ్న తలెత్తే అవకాశముంది. దీనికి సమాధానమేమి టంటే, స్వల్పకాలిక రుణాలను ఇచ్చినప్పుడు, వాటిని వసూలు చేసుకోవడం సులువుగా ఉంటుంది. కాని అప్పు తీసుకున్న వాళ్లు, ఈ రుణాల్ని మధ్యస్థ లేక దీర్ఘకాలిక ప్రణాళికలపై వెచ్చించినట్లయితే, అప్పుతీర్చడం వారికి కష్టతరమై పోతుంది. ఇలాంటి ప్రణాళికలు పూర్తికావడానికి చాలా సమయం పడుతుంది. ఇంకా ధనం కూడా స్థంభించిపోతుంది. ఈ కారణంగా రుణాన్ని తీర్చడం కష్టతరమై పోతుంది. ఇందుకోసమే స్వల్పకాలిక రుణాలు ముమ్మరమై పోయినప్పుడు, ఆ రుణాలు విదేశీ కరెన్సీల్లోనో, ఆహార ధాన్యాల్లోనో, ఆస్తులు మరియు షేర్ మార్కెట్లలోనో సట్టా వ్యాపారం (speculation) కోసం ఉపయో గింపబడతాయి. దీనికి కారణం ఏమి టంటే, అప్పు తీసుకున్నవారు అలా చేస్తే వారి ధనం స్వల్ప వ్యవధి కోసం మాత్రమే ఆగిపోతుంది. కాని దీని వల్ల ఆర్థిక అస్థిరత్వం పెరిగి పోయే అవకాశం అధికమైపోతుంది.

స్వల్పకాలిక అప్పులు తీసుకోకూడదని దీనికి అర్థం కాదు. సముచిత మైన పెట్టుబడి కోసం ఇలాంటి అప్పులు తీసుకోవడంలో తప్పు లేదు. అయితే ఇలాంటి అప్పుల లక్ష్యం, ఈ డబ్బుతో వాస్తవమైన వస్తువుల, సేవల (real goods and services) క్రయవిక్రయాలై ఉండాలి. ఇస్లామీయ ఆర్థిక విధానంలో ఈ లక్ష్యం కోసం వడ్డీరహిత మార్గాలున్నాయి. నేడు ప్రపంచంలోని వివిధ దేశాల్లో కనబడుతున్నట్లు, ఇలాంటి స్వల్పకాలిక అప్పుల శాతం అత్యధికంగా పెరిగిపోతే, అందులోని అత్యధిక ధనం (సట్టా వ్యాపారం (speculation) కోసం వినియోగింపబడుతుంది. దీనివల్ల ఆర్థిక మార్కెట్లలో అస్థిరత్వం పెరిగి పోతుంది. ఈ విషయాన్ని ఇంకా తేటతెల్లం చేయడానికి క్రింద మూడు దృష్టాంతాలను వివరిస్తున్నాము. అందులో మొదటిది, తూర్పు ఆసియా ఆర్థిక సంక్షోభం. రెండవది, అమెరికా లోని దీర్ఘకాలిక పెట్టుబడులను

సమకూర్చే (LTCM) Long Term Capital Management కంపెనీలు దివాళాతీయడం, ఇక మూడవది, విదేశీ కరెన్సీ మార్కెట్లలో పదే పదే సంక్షోభం, అల్లకల్లోలం ఏర్పడడం.

## తూర్పు ఆసియా (దేశాల) ఆర్థిక సంక్షోభం

తూర్పు ఆసియాకు చెందిన కొన్ని దేశాలు అత్యంత వేగంగా ఆర్థిక ప్రగతిని సాధించాయి. ఈ కారణంగానే వాటిని తూర్పు చిరుత పులులుగా ( Estern Tigers) పిలుస్తారు. కాని 1997లో ఈ దేశాలే తీవ్రమైన ఆర్థిక సంక్షోభానికి గురయ్యాయి. ఎందుకని ఈ దేశాలు ఆర్థిక సంక్షోభానికి గురి అయ్యాయి? ఆ దేశ ప్రభుత్వాల ఆర్థిక పాలసీలు పాకిస్తాన్‌లాగా అయోగ్యమై ఉన్నాయా? ఈ కారణం అసలే కాదు. వారి బడ్జెట్‌లలో సర్వసామాన్యంగా ఉండే లోటు (deficit) లేకపోవడమే కాదు, వాటిలో ఇంకా పొదుపులు (surplus) కనబడ్డాయి. ఇవే కాకుండా ఈ దేశాల సామూహిక పొదుపులు కూడా వారి జాతీయ నిష్పత్తిలో దాదాపు 35 శాతం వరకు ఉన్నాయి. ఈ శ్రేష్ఠతలు అనేక ప్రగతిశీల దేశాలకు ఉత్సాహాన్ని నింపేవిగా ఉన్నాయి.

అయితే ఇన్ని శ్రేష్ఠతలు, ప్రత్యేకతలు ఉండి కూడా సంక్షోభం ఎందుకొచ్చింది అనేదే ప్రశ్న. అత్యధిక మంది పరిశోధకులు కలసి దీని కోసం తెలిపిన అతిపెద్ద కారణం ఏమిటంటే, స్వల్పకాలిక విదేశీ అప్పుల ప్రవాహం (inflow) ఈ దేశాల్లో ఎంత గొప్పగా ఉండేదంటే, విదేశాల నుండి వచ్చిన మొత్తం పెట్టుబడుల్లో ఇవి 60 శాతాన్ని దాటిపోయాయి. అందువల్ల దేశీయ బ్యాంకులు, ప్రైవేటు సెక్టారుకు ముమ్మరంగా స్వల్పకాలిక అప్పులు జారీ చేశాయి. ఇలాంటి అప్పుల, సమృద్ధి సట్టా వ్యాపారం (speculation)లో అభివృద్ధికి దోహదపడుతుందని పైన వివరిస్తూ వచ్చాము. ఈ స్వల్పకాలిక అప్పుల కారణంగా స్టాక్ మార్కెట్, ప్రాపర్టీ మార్కెట్లలో సట్టా వ్యాపారం వ్యవహారాలు బాగా పెరిగిపోయాయి, ధరలు ఆకాశాన్నంటుకున్నాయి.

సర్వసామాన్యంగా అన్ని బ్యాంకులు పూచికత్తులను, విశ్వసించినట్లే, అక్కడి బ్యాంకులు కూడా పూచికత్తులను విశ్వసించే పొరపాటు చేశాయి. ఇలాంటి అప్పుల్లో దాగి ఉండే ముప్పులను (risks) సరిగా అంచనా వేయడానికి అవి ప్రయత్నించలేదు. అందుకని పరిస్థితులు తారుమారు కాగానే– దీనికి ఏదైనా కారణం కావచ్చు. విదేశీ బ్యాంకులు తమ స్వల్పకాలిక అప్పుల్ని తిరిగి చెల్లించాల్సిందిగా ఒత్తిడి చేయనారంభించాయి. అప్పుడు దేశీయ బ్యాంకులు తమ ఋణగ్రస్తుల్ని వారి అప్పులు చెల్లించాల్సిందిగా కోరినప్పుడు, వారు అత్యంత వేగంగా తమ ఆస్తుల్ని అమ్మనారంభించారు. ఈ విధంగా స్కాట్ మార్కెట్లలో, ప్రాపర్టీ మార్కెట్లలో ధరలు విపరీతంగా పడిపోయాయి. ఋణ గ్రస్తులకు అప్పులు తీర్చడం కష్టతరమైపోయింది. ఈ కారణంగా బ్యాంకు వ్యవస్థలోనే తీవ్ర సంక్షోభం మొదలయింది. విదేశీ బ్యాంకుల్ని ఈ సంక్షోభం నుండి బయటపడేయడానికి అంతర్జాతీయ ద్రవ్యనిధి (I.M.F.)కి (bailout) రూపంలో ఒక పెద్ద రుణాన్ని సమకూర్చవలసి వచ్చింది. ఈ విధంగా విదేశీ బ్యాంకులైతే ఈ సంక్షోభం నుండి తప్పించుకోగలిగాయి, కాని దేశీయ బ్యాంకులు తీసుకున్న అప్పులు I.M.F. ద్వారా జారీ చేయబడినవి అయినందున, అవి ఆయా ప్రభుత్వాల వైపునకు మళ్ళించడ్డాయి. ఈ విధంగా ప్రభుత్వాలపై వచ్చిపడిన ఈ అప్పుల్ని ఎవరు తీర్చాలి? చివరికి ఈ అప్పుల్ని టాక్సు చెల్లించే వారే, అంటే ప్రజలే తీర్చాల్సి ఉంటుందనే విషయం అందరికీ తెలిసిందే!

దీనికి భిన్నంగా వడ్డీరహిత ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థ గనక వుండి వుంటే, లాభనష్టాల్లో అవి సమాన భాగస్వాములుగా చేరి ఉంటే, అవి ఎదురయ్యే ముప్పుల్ని సరిగ్గా అంచనా వేయడానికి గట్టి ప్రయత్నం చేసేవి, ఇంకా పూచి కత్తుల్ని అంత గుడ్డిగా నమ్మకపోయేవి. అంతేకాకుండా అవి ఇంత ధారళంగా అప్పులివ్వకపోయేవి, ఫలితంగా స్టాక్ మార్కెట్లలో, ప్రాపర్టీ మార్కెట్లలో మొదట్లో తీవ్రమైన పెరుగుదల, ఆ తరువాత విపరీతమైన తగ్గుదల వచ్చి ధరలు పడి పోయే పరిస్థితి రాకపోయేది. లాభనష్టాల్లో భాగస్వామ్యం

కారణంగా బ్యాంకు వ్యవస్థలో ఎంతటి క్రమశిక్షణ (discipline) వస్తుందంటే తద్వారా ఇలాంటి సంక్షోభాల్ని అధిగమించవచ్చు. ఈ విషయాన్ని నేడు అంతర్జాతీయ నిపుణుల సంస్థలు కూడా అంగీకరిస్తున్నాయి.

## Long Term Capital Management లు దివాళా తీయడం

(LTCM) Long Term Capital Management అమెరికాలోని ఒక హేజ్‌ఫండ్ (Hedge Fund) సంస్థ. స్టాక్, ప్రాపర్టీ, ఆహార ధాన్యాలు, విదేశీ మారకద్రవ్యం (Foriegn Exchange)మొదలుగాగల మార్కెట్లలో సట్టా వ్యాపార కార్యకలాపాలు నడపడం దాని ప్రధాన లక్ష్యం. ఇలాంటి హేజ్ ఫండ్స్‌లు, తమ స్వంత ధనం (Equity)కన్నా, బయటి అప్పులపైనే అత్యధికంగా ఆధారపడ తాయి. ఈ విధంగా వారి లివెరేజ్ (liverage) నిష్పత్తి అత్యధికంగా ఉంటుంది. ఇలాంటి నిధులు తమ సట్టా వ్యాపార కార్యకలాపాల కారణంగా అంతర్జాతీయ స్టాక్, ప్రాపర్టీ మరియు ఫారిన్ ఎక్స్చేంజ్ మార్కెట్లలో అస్థిరత్వాన్ని నెలకొల్పాయి. ప్రపంచమంతటిలోని స్టాక్‌మార్కెట్లలో, విదేశీమారక ద్రవ్యాల మార్కెట్లలో వచ్చిన సంక్షోభాలన్నిటిలో ఈ హేజ్‌ఫండ్స్ ప్రముఖపాత్ర వహించాయి. సంక్షోభానికి ముందు L.T.C.M. యొక్క తన స్వంత ధనం లేక పెట్టుబడి 4 బిలియన్ డాలర్లకన్నా కొంచమే ఎక్కువుండేది. కాని దాని లివెరేజ్ 25 వరకుండేది. అంటే అది తన స్వంత పెట్టుబడి ఒక డాలర్ కలిగి ఉంటే, 25 డాలర్లు అప్పు తీసుకున్నవే. అనేకానేక కారణాల వల్ల ఎప్పుడైతే దాని ఆస్తుల ధరలు తగ్గిపోనారంభిచాయో, అది ఇంకా అప్పులు చేసుకుంటూపోయింది. ఫలితంగా దాని లివెరేజ్ 50 డాలర్లకు చేరుకుంది. దానికున్న ఆస్తుల ధరల్లో మాంద్యము వచ్చినా అప్పులు మాత్రం చేస్తూనే పోయింది. చివరికి దాని లివెరేజ్ 167కు చేరుకుంది.[20] ఒకవేళ అమెరికా ఫెడరల్ రిజర్వ్ బ్యాంకేగనక దీనికి సహాయమందించి ఆదుకోకపోతే, ఈ

సంక్షోభం ప్రపంచంలోని మొత్తం బ్యాంకుల వ్యవస్థనే ప్రభావితం చేసి, ప్రపంచమంతటిలో వ్యాపార మాంద్యానికి దారితీసేది, పేద దేశాల కష్టాలు విపరీతంగా పెరిగిపోయేవి. లాభనష్టాల్లో బ్యాంకులే గనక భాగస్వామ్యాన్ని కలిగివుంటే, ఈ విధంగా ఒకే కంపెనీకి ఇంతపెద్ద మొత్తంలో అసలు రుణాలే ఇవ్వకపోయేవి. పూచికత్తు (collateral)పై అవసరానికి మించిన విశ్వాసమే వాటిని అంతపెద్ద అప్పుల్ని జారీచేయడానికి ఆమోదింపజేసింది.

## విదేశీ మారక ద్రవ్యపు (Foreign Exchange) మార్కెట్‌లో సంక్షోభం

స్వల్పకాలిక ఋణాలపై అత్యధికంగా ఆధారపడడం వలన విదేశీ మారకద్రవ్య (Foreign Exchange) మార్కెట్లు కూడా అత్యధికంగా అస్థిరతకు గురి అయ్యాయి. ఫారిన్ ఎక్స్చేంజ్ మార్కెట్లలో దినసరి క్రయవిక్రయాల విలువ 1998 ఏప్రియల్ నెలలో 1,490 బిలియన్ డాలర్లుగా నమోదైంది.[21] కాని వ్యాపార వస్తువుల దినసరి క్రయవిక్రయాల విలువ కేవలం 30 బిలియన్ డాలర్లుగా మాత్రమే రికార్డు అయింది.[22] అంటే ప్రపంచమంతటిలో ఫారిన్ ఎక్స్చేంజ్ క్రయవిక్రయాలు, వ్యాపార వస్తువుల విలువకన్నా 49రెట్లు అధికంగా జరిగాయి. దీనివల్ల ఫారిన్ ఎక్స్చేంజ్ క్రయవిక్రయాల్లోని అత్యధిక భాగం నిజమైన విక్రయాల కోసం కాకుండా సట్టా వ్యాపారం కోసమే జరుగుతున్నదనేది తేలిపోయింది. ఫారిన్ ఎక్స్చేంజ్ రేట్లలో అత్యధికమైన నిమ్నోన్నతలకు సట్టా వ్యాపారం గొప్ప కారణమని తెలుస్తూనే ఉంది. అందుకనే B.I.S. (Bank for International Settlements) జనరల్ మేనేజర్ అంద్ర్యూ క్రోకెట్ ఇలా చెప్పారు: "చెల్లింపుల వ్యవస్థ నడుము విరిగే ముప్పునకు చేరుకున్న కారణంగా మన ఆర్థికం అసురక్షితమైపోతున్నది."[23]

స్వల్పకాలిక రుణాలపై అత్యధికంగా ఆధారపడడం సముచితం కాదనుకున్నట్లయితే, దీర్ఘకాలిక రుణాలపై లేదా లాభనష్టాల్లో భాగస్వామ్యంపై ఆధారపడిన పెట్టుబడి (Equity)ని ఆశ్రయించాల్సి ఉంటుంది. ఈ రెండింటిలో కూడా

స్వంత ధనంపై ఆధారపడిన పెట్టుబడి (Equity) మేలైనది, ఎందుకంటే ఇందులో పెట్టుబడి పెట్టేవాడు ప్రణాళికల మంచిచెడుల్ని నిశితంగా పరిశీలించడానికి బద్ధుడైపోతాడు.[24] దీనివల్ల పెట్టుబడిపెట్టే విధానంలో క్రమశిక్షణ (Disciplain)వస్తుంది. ఆర్థికంలో స్థిరత్వం, శ్రేష్ఠత వస్తుంది. అందుకని ప్రపంచంలోని ప్రఖ్యాతిగాంచిన స్కాలర్లు అనేక మంది అనగా ( G.L. Bach, Joan Robinson, Kindle berger charles, Hyman Minsky, Henri simons మరియు Kenneth Rogoffతో సహా ఏ నిర్ణయానికి వచ్చారో తెలుసా? "అప్పులను అత్యధికంగా నమ్ముకున్న ఆర్థిక వ్యవస్థ కన్నా, స్వంత ధనంపై ఆధారపడి పెట్టుబడి పెట్టిన ఆర్థిక వ్యవస్థ అత్యంత స్థిరంగా ఉంటుంది" అని పేర్కొన్నారు.

## చివరి మాట

స్వంత షేర్లతో పెట్టుబడి పెట్టి స్థాపించిన వ్యవస్థ, సర్వమానవ సాఫల్యమనే లక్ష్యాన్ని చేరుకోవడంలో అత్యంత సహాయకారిగా ఉంటుందనటంలో సందేహం లేదు. ఇలాంటి వ్యవస్థలోనే సర్వమానవుల జీవితావసరాలు అన్నీ కూడా మేలైన పద్ధతిలో పూర్తికాగలుగుతాయి. అందరూ గౌరవప్రదమైన మార్గంలో తమ సంపదను పెంచుకోగలుగుతారు. రాబడి, ధనానికి సంబంధించి న్యాయప్రదంగా పంపకం జరుగుతుంది. అంతేకాకుండా ఆర్థిక స్థిరత్వం సంప్రాప్తమవుతుంది. ఈ లక్ష్యాలన్నిటినీ, పెట్టుబడిదారీ వ్యవస్థ (capitalism) ప్రభావపూర్వకంగా అందించజాలదు. ఈ వ్యవస్థను ఆచరిస్తున్న దేశాలు మానవ సాఫల్యాన్ని తమ లక్ష్యంగా ఎన్నుకోలేదని కాదు లేక ఈ లక్ష్యాల్ని సాధించటానికి కావలసిన సంకల్పం, వనరులు వారి వద్ద లేవని కూడా కాదు. ఇవన్నీ ఉండీ కూడా పై లక్ష్యాలను సాధించలేకపోతున్నాయంటే అసలు కారణం, ఈ వ్యవస్థలోనే లోపముంది. అందుకని ఈ వ్యవస్థ ద్వారా పై లక్ష్యాలను సాధించడం దుర్లభమైపోతుంది.

ఈ దేశాలు పై లక్ష్యాల్ని సాధించడంలో ఎందుకు విఫలమయ్యాయి? ఈ వ్యవస్థ ఆదర్శం, దాని ఆచరణ పంథా– ఈ రెండింటి మధ్య వైరుధ్యం ఉండటం దీని మౌలిక కారణం. ఈ దేశాలు మానవ సాఫల్యమే తమ ఆదర్శ మని, లక్ష్యమని ప్రకటించనైతే ప్రకటించాయి. ఈ ఆదర్శాన్ని, లక్ష్యాన్ని నిర్ణయించుకోవడానికి ఆ దేశాలకు వాటి ధార్మిక విలువలు ప్రేరేపించాయి. కాని వాటిని పొందడానికి అవి ఆచరించిన మూల పద్ధతి మాత్రం ధార్మిక విలువలు కావు. వాటికి బదులు సోషల్ డార్వినిజం అనబడే ధార్మికేతర ఫిలాసఫీని అనుసరించాయి. ఈ ఫిలాసఫి బలాఢ్యులే బ్రతుకుతారని, బలహీనులు అంతమవుతారని అంగీకరిస్తుంది. ఈ ఆచరణ విధానం లేక పద్ధతి ధన (వనరుల) వాడుకపు వివిధ రూపాల మధ్య (Allocation of Resources) వడ్డీ రేటును ప్రధాన అంశంగా గుర్తిస్తుంది. దీనివల్ల ధనికులకే వనరులను పొందడంలో ప్రాముఖ్యత లభిస్తుంది. దీని ద్వారా ధనికులు ఇంకా ధనవంతులుగా మారడమే కాకుండా, ధనం ఒకేచోట కేంద్రీకృతమై పోతుంది. అంతేకాకుండా ఇది ఆడంబరాన్ని, భోగవిలాసాల్ని, సట్టా వ్యాపారంను ఇంకా అనవసరమైన ఖర్చుల పెరుగుదలకు దోహదపడు తుంది. వీటివల్ల సర్వ మానవ సంక్షేమమనే మహోన్నత లక్ష్యానికి విఘాతం ఏర్పడుతుంది. పెట్టుబడుల అంతర్జాతీయ మార్కెట్లలో అస్థిరత్వం కూడా ఏర్పడుతుంది. అందుకనే మిల్స్ (Mills), ప్రెస్‌లే (Presley)లు దీన్ని ఇలా విశ్లేషించారు.

**"మనం గత చరిత్రను అధ్యయనం చేసినట్లయితే, పదహారవ శతాబ్దంలో యూరప్‌లో వడ్డీ నిషేధాన్ని వ్యతిరేకించకపోయి ఉంటే ఎంత బాగుండేదని విశ్వసించటానికి తగినన్ని ఆధారాలున్నాయి. వడ్డీని నిషేధించడం వెనుక దాగి ఉన్న నైతిక దృక్పథంలోని యుక్తిని అర్థం చేసుకునేటంతటి సామర్థ్యం (జ్ఞానం) అప్పట్లో లేదు."**[26]

## రెండవ అధ్యాయపు పాదసూచికలు

1. యూదు మతం మరియు క్రైస్తవంలో వడ్డీ నిషేధం గురించి తెలుసుకోవడానికి (Hastings) యొక్క ( Encyclopedia of Religion and Ethics) లో ( John, et.al) "Usury" పైన వ్రాసిన వ్యాసం -సంపుటం-12, పేజీలు 548-558. దీనితోపాటే 1907 (Noonan), పేజి-20. హిందూ ధర్మంలో వడ్డీని ఖండించిన దాని గురించి తెలుసు కోవడానికి Bokare 1993, పేజి-168.
2. చూడండి. John, et.al పేజీ -558
3. బైబిల్‌లోని Ezekiel 8:18, 7,13 మరియు 22:25-27 మరియు 22:25 Leviticus 25:36-38, Deuteronomy 23:19 మరియు Luke 6:35
4. చూడండి. John, et.al పేజి. 551 Lateran క్రీ.శ. పద్నాలుగవ శతాబ్దం వరకు పోపు (Pope) నివసిస్తుండే స్థలము.
5. చూడండి John, et.al మరియు (Noonan) 1957
6. "భూమిలో అణచివేయబడిన వారిని కనికరించాలనీ, వారిని నాయకులుగా చేయాలనీ, వారినే వారసులుగా చేయాలనీ, భూమిలో వారికి అధికారాన్ని ప్రసాదించాలనీ (మేము కోరాము)." (అల్ ఖసస్ : 5)
7. ఈ శీర్షికపై ఇంకా వివరంగా తెలుసుకోవాలనుకుంటే రచయిత వ్రాసిన పుస్తకం (Towards a just monetary system pages-19-29 & 107-145) మరియు 1992లో ప్రచురితమైన రచయిత పుస్తకంలోని 324-327 పేజీలు, ఇవేకాకుండా 2000లో ప్రచురితమైన రచయిత రెండు వ్యాసాలు, ఈ పుస్తకం చివరలో ఆధారగ్రంథాల పట్టికలో పేర్కొనబడ్డాయి.

8. 2003, అక్టోబర్ 15వ తేదీన కౌలాలంపూర్‌లో జరిగిన ముస్లిం దేశాధి నేతల శిఖరాగ్ర సమావేశంలో ప్రెసిడెంట్ ముషర్రఫ్ చేసిన ప్రసంగం నుండి ఈ గణాంకాలు సేకరించబడ్డాయి.

9. ఈ గణాంకాలు I.M.F. యొక్క 2000 Year Book నుండి స్వీకరించడం జరిగంది. అందులో పేజీ 77-79 వరకు ఒక స్టేట్‌మెంట్ ఉంది, దాని శీర్షిక Consumption as percent of GDP "పొదుపుకు సంబంధించిన గణాంకాలు" ఇది దాని నుండే గ్రహించడం జరిగింది.

10. Oecd, Economic Outlook, Decembe 1991, Table 2, page .7 and June, 2000, Table-22, Page. 266.

11. Peach and Steindel, september, 2000, page -1

12. Bigsten, 1987, page-156

13. Mishan, 1971, page - 205

14. Morgan Guarantee Trust Company of New York, 1987, page-7

15. The Economist, 16 Februray 1985, page-15

16. ఇంకా వివరాల కోసం రచయిత పుస్తకం Towards a just Monetary system, 1985, pages- 200-202

17. వివరాలు, ఆధారాల కోసం రచయిత పుస్తకం (The Future of Economics: An Islamic perspective, 2000 C. pages 283-285)

18. Friedman, 1982, page-4

19. ఒకరి స్వంతధనం ఒక రూపాయి ఉంది. అతను పెట్టుబడి కోసం పది రూపాయలు అప్పుగా తీసుకుంటాడు, అప్పుడు అతని లెవరేజ్

(Leverage) పదిగా పరిగణింపబడుతుంది. ఒకవేళ 25 రూపాయలు అప్పుగా తీసుకుంటే అతని లెవరేజ్ 25 అవుతుంది.

20. IMF-World Economic Outlook, December, 1998, page-55

21. Bank for International Settlements యొక్క 1998, అక్టోబర్ 19వ తేదీ ప్రెస్ రిలీజ్.

22. ప్రపంచమంతటి సామూహిక ఎగుమతి, దిగుమతుల విలువ 1998 ఏప్రిల్‌లో 9,087 బిలియన్ డాలర్లు, IMF-International Financial Statistics, November, 1998. ఇదే విధంగా 1998 ఏప్రిల్ నెలలో దినసరి సరాసరి వ్యాపారం 30.30 బిలియన్ డాలర్లుగా ఉంది.

23. BIS Press Release, 22, june, 1994, page-3

24. IMF. World Economic Outlook, May, 1998, Page-82

25. Minsky, 1975

Simons, 1948, Page-320

John Robinson, December, 1977, page-133

Kindle berger, 1978, page-66

Bach, 1977, page-182, And Rogoff, Fall 1999, pages-211-216

26. Mills and Presley, 1999, page-120



# 3. వడ్డీరహిత బ్యాంకింగ్ వ్యవస్థ సాధ్యమా?

గడిచిన రెండు వ్యాసాల్లో రెండు శీర్షికలపై చర్చించడం జరిగింది. ఒకటి, ఇస్లామీయ ధర్మంలో నిజంగానే వడ్డీ నిషిద్ధమా? ఒకవేళ నిజంగానే నిషిద్ధమైతే, దానిలో దాగి ఉన్న యుక్తి ఏమిటి? ఈ రెండు ప్రశ్నలకు గడిచిన వ్యాసాల్లో సమాధానమిచ్చాము. ఇక ఇప్పుడు ఈ ఆధునిక కాలంలో ఆచరణా యోగ్యమైన, ప్రభావవంతమైన వడ్డీరహిత బ్యాంకింగ్ వ్యవస్థను స్థాపించడం సాధ్యమా? అనే ప్రశ్న పాఠకుల మస్తిష్కాల్లో జనించడం అసహజమేమీ కాదు.

అత్యధిక ముస్లింలు, కొంతమంది పాశ్చాత్య విద్యాంసులు ఇది సంభవమేనని సమాధానమిస్తారు. మరికొందరు, అందులో కొంతమంది ముస్లింలు కూడా ఉన్నారనుకోండి, ఇది సంభవం కాదని సమాధానమిస్తారు. సంభవం కాదని సమాధానమిచ్చేవారి వాదన ఏమిటంటే, వడ్డీరేటు అనేది ఒక విలువ, మూల్యం. ఒక ఆర్థిక వ్యవస్థలో, ఇతర అన్ని వస్తువుల మూల్యంలాగే, ఆర్థిక వనరుల్ని కోరడం, అందించడం మధ్య సమతుల్యాన్ని ఏర్పరచడంలో ఇది ప్రధాన భూమికను పోషిస్తుంది. ఒకవేళ వడ్డీనే గనక నిషేధిస్తే, ఆర్థిక వనరులు ఎలా సమకూరుతాయి, ఎలా వినియోగింపబడతాయి? విలువ లేకుండా ఊరికనే సరఫరాచేస్తే, దాన్ని అత్యధికంగా కోరుతారు, ఇంకా ఆర్థిక వనరుల్ని, పెట్టుబడుల్ని సమకూర్చడానికి ఎవ్వరూ ముందుకురారు. ఈ విధంగా కోరడం,

సమకూర్చడం మధ్య ఏదైతే సమతుల్యత ఉందో, అది అంతమైపోతుంది. అందుకని వారు పట్టుదలగా వాదించేదేమిటంటే, వడ్డీ అనేకానేక చెడులకు పుట్టినిల్లు అయినప్పటికీ మనం దీన్ని భరించక తప్పదు.

ధనాన్ని పొదుపు చేసి మిగులుగా ఉంచిన వారు మరియు ఈ ధనాన్ని ఉపయో గించే వారి మధ్య పంపకం చేయడం కోసం ఒక విలువ అంటూ ఉండాలనే విషయాన్ని ఎవరూ వ్యతిరేకించలేరు. ఈ విలువ అవసరం-సరఫరాల మధ్య సమతుల్యాన్ని ఏర్పరచడమే కాకుండా, దీన్ని నిరంతరంగా ఉంచగలగాలి. ఇది అనివార్యమే. కాని ఏ విలువ అత్యంత సముచితమైనది అనే విషయంలో వ్యతిరేకత ఉండొచ్చు. అవసరం- సరఫరాల మధ్య సమతుల్యాన్ని ఏర్పరచడ మొక్కటే కాకుండా, మన అసలు లక్ష్యాన్ని పొందడంలో కూడా సహాయకారి కాగల విలువే అత్యంత సమంజసమైనదని, సముచితమైనదని పాఠకులు అంగీకరిస్తారు. అయితే మనం కోరే ఆ లక్ష్యం ఏమిటి? ఇస్లాం దృష్టిలో ఈ లక్ష్యం ఎలాంటి భేదభావం లేకుండా సర్వమానవ సంక్షేమం. వారు తెల్లవారు కానివ్వండి, నల్లవారు కానివ్వండి, పేదలైనా, ధనికులైనా, పురుషులైనా, మహిళలైనా, పిల్లలైనా, ముదుసలి వారైనా, వారు తూర్పునకు చెందిన వారైనా, పశ్చిమానికి చెందినవారైనా ప్రజలందరికి సంక్షేమ సాఫల్యాలు ఒనగూడాలి. ఇలాంటి సర్వసాఫల్యం లేక సంక్షేమం ఎప్పుడు సాధ్యమవుతుంది? దీన్ని పొందాలంటే, దానికి ముందు కొన్ని అనుబంధ లక్ష్యాలు నెరవేరాలి. ఈ లక్ష్యాల్లో క్రింద పేర్కొన్న నాలుగు అంశాలు ప్రధానమైనవి. ప్రాముఖ్యమైనవి. అవేమిటంటే: 1. మానవులందరి కనీస మౌలిక జీవితావసరాలు పూర్తికావాలి. 2. ప్రతి మనిషి తన యోగ్యత మరియు శ్రమను అనుసరించి ఉపాధిని పొందడానికి ఉద్యోగావకాశాలు పెరగాలి. 3. న్యాయ ప్రదంగా ధన పంపకం జరగాలి. 4. ఆర్థిక సుస్థిరత్వం ఉండగలగాలి.

మానవ శ్రేయోసాఫల్యాల సాధనలో పైనుదహరించిన అనుబంధ

లక్ష్యాలు, వడ్డీతో కూడిన వ్యవస్థలో పరిపూర్ణంగా సాధించలేమని గడిచిన వ్యాసంలో వివరంగా తెలుపుతూ వచ్చాము. వడ్డీతో కూడిన వ్యవస్థలో అప్పులకు ప్రేరణే కాకుండా, అవలీలగా అప్పులివ్వడం జరుగుతుంది. దీనివల్ల ప్రజల్లోనూ, ప్రభుత్వాల్లోనూ తమ రాబడికన్నా అధికంగా ఖర్చుపెట్టే మనస్తత్వం పెరిగిపోతుంది. ఈ కారణంగా ఒక వైపు పొదుపులో క్షీణత వస్తే, మరొకవైపు అశేష ఆర్థికత్వ (Macro economic) కష్టాలతోపాటు, ఆర్థిక వ్యవస్థలో కూడా అస్థిరత్వం పుట్టుకొస్తుంది. దీనివల్ల జీవితావసరాలు పూర్తిచేసుకోవడానికి, ఉత్పత్తి కోసం పెట్టే పెట్టుబడులకు పనికివచ్చే వనరులు, సంపద కూడా తగ్గిపోతాయి. విలాసాల కోసం, దుబారాల కోసం ఈ వనరులు ఉపయోగింపబడడం వల్ల పై లక్ష్యాల కోసం వనరులు బహుస్వల్ప పరిమాణంలోనే లభిస్తాయి. పొదుపులో క్షీణత, ఆర్థిక నిర్మాణంలో మృదుత్వం లేకపోవడం (Structural Rigidities) ఇంకా ఇతర సామాజిక, ఆర్థిక బలహీనతలతో ఇవి కలిసి పెట్టుబడి నిష్పత్తిలోను, ఉద్యోగావకాశాల పెరుగుదలలోనూ ఆటంకాలు కల్పిస్తాయి. ఇంకా సామూహికంగా ఇవన్నీ కలిసి ఆర్థిక ప్రగతిపై చెడు ప్రభావం వేస్తాయి. ప్రత్యేకించి పేద, బడుగు వర్గాలపై ఇది చాలా చెడు ప్రభావం వేసి, ఆర్థిక అసమానతలను పెంపొందిస్తాయి. ఈ కారణాల వల్లనే, ఇతర ధర్మాలు నిషేధించినట్లే ఇస్లాం కూడా వడ్డీని నిషేధించింది. ప్రభుత్వ మరియు ప్రైవేటు రంగాల అనవసరపు ఖర్చుల్లో తగ్గుదల వస్తే, దాని వల్ల జాతీయ ఆదాయంలో పెరుగుదల వస్తుందని ఆశించవచ్చు, ఇంకా స్వంత ధనం లేక స్వంత పెట్టుబడి కారణంగా పెట్టుబడులు కూడా గణనీయంగా పెరిగిపోతాయి. ఇస్లాం ఆచరణాత్మకమైందే కాదు, వాస్తవాల్ని అంగీకరించే ధర్మం కూడాను. అందుకని అది రుణాన్ని కూడా అనుమతిస్తుంది. అయితే షరతు ఏమిటంటే, ఈ రుణాలు వాస్తవమైన వ్యాపార సరుకులు లేక సేవల క్రయవిక్రయాల కోసమే తీసుకోవాలి. ఆహార ధాన్యాల షేర్లు, ఆస్తుల మరియు విదేశీ మారకద్రవ్యాల మార్కెట్లలో సట్టా వ్యాపారం కోసం వీటిని వినియోగించ

రాదు. దీని కోసం అది వడ్డీరహిత కొన్ని పద్ధతుల్ని కూడా ప్రతిపాదించింది. అదేమిటో ఈ వ్యాసం చివర్లో తెలుసుకుందాము. ఈ విధంగా ఒక ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థలో ఇచ్చిపుచ్చుకోవడాలు రెండు విధాలుగా ఉంటుంది. ఇందులో ఒకటి, లాభనష్టాల్లో భాగస్వామ్య ప్రాతిపదిగానైతే, ఇంకొకటి ఇస్లాం ప్రతిపాదించిన పద్ధతిలో వాస్తవమైన సరుకులు, సేవల అరువు క్రయవిక్రయాల రూపంలో.

## లాభనష్టాల్లో భాగస్వామ్య ప్రాతిపదికగా పెట్టుబడి

పెట్టుబడి కోసం ఇస్లాం రెండు పద్ధతుల్ని ఆమోదించింది. ఒకటి, ముజారిబత్[1] (ఉమ్మడిగా, పొత్తుతో కూడిన పెట్టుబడి పెట్టడం). రెండవది, ముషారికత్[2] (సంయోగంతో, పాళ్లతో కూడిన పెట్టుబడి పెట్టడం). పెట్టుబడికి సంబంధించిన ఈ రెండు పద్ధతుల్లో కూడా పెట్టుబడిదారు వడ్డీ వ్యాపారిలాగా పెట్టుబడి మీద వడ్డీ తీసుకోడు. దానికి బదులు లాభనష్టాల్లో పాలుపంచు కుంటాడు. లాభం వస్తే ఒక నిర్ణీత నిష్పత్తిలో అతను లాభపడతాడు. అదే విధంగా నష్టం వస్తే, తన పెట్టుబడిని అనుసరించి అదే నిష్పత్తిలో నష్టాన్ని కూడా భరిస్తాడు. ఇస్లాం ప్రతిపాదించిన న్యాయసూత్రాలకు అనుగుణంగా పెట్టుబడిదారుకు ఏ నిష్పత్తిలో లాభం చెందాలి అనే విషయాన్ని పెట్టుబడిదారు, అతని భాగస్వామి ఉభయుల అంగీకారములతో నిర్ణయించుకుంటారు. అయితే ఇది ఏ నిష్పత్తిలో చెందాలి అనే విషయం నిర్ణయించేటప్పుడు అనేక విషయాల్ని పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. అందులో యోగ్యత, కీర్తి ప్రతిష్ఠలు, శ్రమ మరియు ప్రమాదాలు కూడా చేరి ఉంటాయి. అయితే నష్టానికి సంబంధించినంతవరకు, కేవలం పెట్టుబడి పెట్టిన నిష్పత్తి వరకే ఉంటుంది.[3] నష్టంలో పాలుపంచుకోవడం అనేది పెట్టుబడిదారు తను పెట్టిన పెట్టుబడి నిష్పత్తి వరకే పరిమితమవుతాడు, అంతకు మించికాదు. కంపెనీలకు సంబంధించిన షేర్ల పెట్టుబడుల్లో కూడా లాభనష్టాల్లో భాగస్వామ్యం ఉంటుంది కనుక

అది కూడా ఆమోదించబడినదే. ఇలాంటి కంపెనీల ద్వారా పెద్ద మొత్తాల్లో పెట్టుబడుల్ని సేకరించడమే కాక, పెద్ద ప్రమాదాల్ని కూడా ఎదుర్కొనవచ్చు. దీనికోసం సముచిత చట్టాలతో కూడిన ఒక సుసంఘటిత షేర్ మార్కెట్ (స్టాక్ మార్కెట్) అవసరమవుతుంది. దీనివల్ల షేర్ హోల్డర్ తనకిష్టమైనపుడు షేర్లను అమ్ముకునే సౌకర్యం ఉంటుంది. ముజారిబత్, ముషారికత్ రూపంలో పెట్టే పెట్టుబడుల్లో ఇలాంటి సౌకర్యముండదు. ప్రభుత్వాలకైనా, కంపెనీలకైనా వడ్డీతో మిళితమైన బాండ్లకు బదులు ఇలాటి కంపెనీ షేర్లు మంచి ప్రత్యామ్నా యంగా ఉపకరిస్తాయి.

## చారిత్రాత్మక సాక్ష్యం

పైన మేము క్లుప్తంగా వివరించిన లాభనష్టాల్లో భాగస్వామ్యంపై ఆధారపడిన ఇలాంటి సంపూర్ణమైన వ్యవస్థ ప్రస్తుతమైతే ప్రపంచంలో ఎక్కడా అమలులో లేదు. అయితే చరిత్రలో ఎప్పుడైనా ఇలాంటి వ్యవస్థ ఉండేదా? దానిపై అమలు జరిగిందా? అనే ప్రశ్న జనిస్తుంది. ముస్లింలు తమ ఉత్పత్తి మరియు వాణిజ్య పెట్టుబడుల కోసం ముజారిబత్ మరియు ముషారికత్ (పొత్తుతో కూడిన, సంయోగంపై ఆధారపడిన)ల ద్వారా ఇలాంటి వడ్డీరహిత ఆర్థిక వ్యవస్థను శతాబ్దాల పర్యంతం విజయవంతంగా కొనసాగించారని చరిత్ర సాక్ష్యం చెబుతున్నది. పిన్స్టన్ యూనివర్శిటీలో తూర్పు ప్రాంతాల అధ్యయనపు విభాగానికి అధిపతిగా పనిచేసిన ప్రొఫెసర్ యుడోవిచ్ (Udovitch) ఇలా వ్రాశారు. "సమాజంలో లభ్యమయ్యే ఆర్థిక వనరులన్నిటినీ జమచేసి, ఆ మొత్తాన్ని ముజారిబత్ మరియు ముషారికత్ పద్ధతుల ద్వారా వ్యవసాయం, పరిశ్రమలు మరియు సుదూర వాణిజ్య కార్యకలాపాల విస్తరణలో వినియో గించడం సాధ్యమనే విషయాన్ని మధ్యయుగం చేసి చూపించింది.[4] ఈ పద్ధ తుల్ని ముస్లింలే కాకుండా, అప్పటి యూదులు, క్రైస్తవులు కూడా ఎంతగా ఉపయోగించే వారంటే, వడ్డీతో కూడిన అప్పుల వినియోగం దాదాపుగా లేనట్లే

ఉండేది[5]." ప్రొఫెసర్ గొయిటాయిన్ (Goitein)ను అనుసరించి, "ఈజిప్టుకు చెందిన జెనిజా దస్తావేజుల్లో (Geniza Documents) వడ్డీకి వ్యతిరేకంగా యూదుత్వం, క్రైస్తవం మరియు ఇస్లాంలో వచ్చిన చట్టపు ఉల్లంఘనకు సంబంధించిన సంఘటన కేవలం ఒకే ఒక దస్తావేజులో కనబడింది. నిజానికి ఈ దస్తావేజుల్లోని చాలా పెద్ద భాగం పెట్టుబడికి సంబంధించినదే ఉంది."[6] ప్రొఫెసర్ షాట్జ్‌మిల్లర్ (Schatzmiller) కూడా "ఇస్లామీయ చరిత్ర ప్రారంభం నుండే స్పెయిన్‌లోని ధనిక వర్గాలు పెట్టుబడుల్ని ప్రోత్సహించారని, వడ్డీ నిషేధితమై ఉన్నప్పటికీ; వారు చేసిన ఈ పనిలో అది వారికి ఎలాంటి ఆటంకాన్ని కల్పించలేదు" అనే నిర్ణయానికి వచ్చారు.[7]

ఇస్లామీయ చరిత్రలో ఇలాంటి బ్యాంకింగ్ సేవల్ని అందించేవారిని "సర్రాఫ్" అనే పేరుతో పిలిచేవారు. వారు కూడా ఒక విధమైన వ్యాపారస్తులే. 908 నుండి 933 వరకు పరిపాలించిన అబ్బాసి ఖలీఫా అల్ ముఖ్‌తదిర్ ప్రారంభ కాలం నుండే, ప్రస్తుత ఆధునిక బ్యాంకులు అందిస్తున్న సేవల్లోని అత్యధిక సేవల్ని ఈ "సర్రాఫ్"లు అందించేవారు.[8] వారికి తమ స్వంత మార్కెట్లుండేవి. నేటి కాలంలో న్యూయార్క్‌లోని వాల్‌స్ట్రీట్, లండన్‌లోని లోంబార్డ్ స్ట్రీట్‌లో బ్యాంకింగ్ వ్యవస్థకు సంబంధించిన అవసరాలు ఎలా పూర్తవుతున్నాయో, ఆ కాలంలో వీరు తమకు అందుబాటులో ఉన్న సాంకేతిక పరిజ్ఞానపు పరిధిలో ఈ అవసరాలన్నీ తీర్చేవారు.[9] కాని ఈ "సర్రాఫ్"లు (పెట్టుబడిదారులు) ఆధునిక కాలపు సాంకేతిక పరిభాష అయిన "బ్యాంకులు"గా పిలువబడేవారు కాదు, అందుకని ప్రొఫెసర్ యుడోవిచ్ (Udovitch) వారిని "బ్యాంకులేని బ్యాంకర్లు"గా పిలువడానికి ఇష్టపడ్డాడు.[10]

ఇస్లామీయ చరిత్రలో ఇలాంటి "సర్రాఫ్"ల (పెట్టుబడులు పెట్టే వ్యాపారుల) ద్వారా, మిగులు ధనాన్ని పెద్ద మొత్తంలో వ్యవసాయం, పరిశ్రమలు, వాణిజ్యంలో వినియోగించడం వల్ల ముస్లింల పరిపాలనా కాలంలో

ఈ రంగాలు ఎంతో పురోగమించాయి. ఫలితంగా వారి వ్యాపార వాణిజ్యాలు పశ్చిమ దిశలో మొరాకో, స్పెయిన్‌ల వరకు, తూర్పు దిశలో ఇండియా, మండనావ్ మరియు చైనా వరకు, ఉత్తర దిశలో సెంట్రల్ ఆసియా వరకు, దక్షిణ దిశలో ఆఫ్రికా వరకు విస్తరించిపోయాయి. దీని సాక్ష్యాధారాలు కేవలం దస్తావేజుల రూపంలోనే కాకుండా, ఏడవ శతాబ్దం నుండి పదకొండవ శతాబ్దం వరకు ముస్లింలచే జారీ చేయబడిన నాణాల రూపంలో కూడా లభించాయి. పురావస్తుశాఖ త్రవ్వకాల్లో రష్యా, ఫిన్‌లాండ్, స్వీడన్, నార్వే, ద్వీపకల్పమైన బ్రిటన్ మరియు ఐస్‌లాండ్‌లలో ఈ నాణాలు లభించాయి. కాస్త ఆలోచించి చూడండి! ఇవన్నీ ఇస్లామీయ రాజ్యభాగాలు కావు, దాని పొరుగున ఉండే దేశాలు.[11] అంటే దీని అర్థం ఇంతటి సుదూర దేశాలతో వ్యాపారం చేయడానికి అవసరమైన వడ్డీరహిత పెట్టుబడులు వారికి లభ్యమయ్యేవి.

అనేకానేక చారిత్రాత్మక కారణాల వల్ల ఇస్లామీయ ప్రపంచం తన నైతిక, సాంకేతిక మరియు ఆర్థిక ఆధిక్యత నుండి వంచించబడింది.[12] ఫలితంగా సామ్రాజ్యవాద శక్తులు అత్యధిక ముస్లిం దేశాల్ని ఆక్రమించుకుని, అక్కడి అనేక ఇస్లామీయ సంస్థల స్థానంలో తమ సంస్థల్ని స్థాపించాయి. ఇలా స్థాన మార్పిడి జరిగిన వాటిలో ఇస్లామీయ పెట్టుబడి వ్యవస్థ కూడా ఒకటి. కాని దైవకృప వల్ల, ముస్లిం దేశాలకు స్వాతంత్ర్యం లభించి, అక్కడ ఇస్లామీయ పునరుజ్జీవన ఉద్యమాలకు బలం చేకూరింది. ఇంకా కనుమరుగైపోయిన అనేక సంస్థల్ని పునఃస్థాపితం చేసే ప్రయత్నాలూ ప్రారంభమయ్యాయి. ఈ ప్రయత్నాల వల్ల గడిచిన కాలాల్లో ఇస్లామీయ పెట్టుబడి వ్యవస్థ పురోగమనానికి, ఆరోగ్య కరమైన దాని ఆర్థిక ప్రగతిని పోషించడంలో కీలకమైన, గౌరవించదగిన పాత్ర వహించిన ముజారిబత్ మరియు ముషారికత్ పద్ధతులు, మరోసారి వాటి గత వైభవాన్ని, చాటుకుంటాయా అనేదే ప్రశ్న.

ఇది సాధ్యం, సంభవం కాదనటానికి సముచితమైన గట్టి ఆధారమైతే

ఏదీ లేదు. దీనికి భిన్నంగా పైన వివరించిన ఇస్లామీయ పద్ధతులను ఈ ఆధునిక ప్రపంచంలో ఆచరించడం ఇంకా సులువైపోయింది. ఎందుకంటే, నేటి వరకు ప్రపంచంలో ఏ సాంకేతిక పురోభివృద్ధి జరిగిందో, ప్రత్యేకించి సమాచార వ్యవస్థలో అభివృద్ధి, లెక్కలకు సంబంధించిన పరిశీలన, పరిశోధన (Accounting and Auditing) పద్ధతుల్లో శ్రేష్ఠత, వీటన్నిటికి మించి సమాచార సాధనాల (Information Technology)లో వచ్చిన విప్లవం వల్ల వీటిని ఆచరించడంలో ఎన్నో సౌకర్యాలు, సౌలభ్యాలు ఏర్పడ్డాయి. ఈ సౌకర్యాలు, సౌలభ్యాల సహాయంతో లెక్కల్ని మేలైన పద్ధతుల్లో ఉంచడం, ఖర్చులు మరియు రాబడుల రికార్డులను స్వచ్ఛంగాను, పారదర్శకంగాను ఉంచడం, లాభనష్టాల్ని సరిగ్గా అంచనా వేయడం, ఇంకా వీటన్నిటి పర్యవేక్షణ, పరిశీలనలతో గణనీయ మైన సేవలను పొందవచ్చు.

## అమ్మకపు ప్రాతిపదికగా పెట్టుబడి పద్ధతి

పైనుదహరించిన అన్ని సౌకర్యాలున్నప్పటికీ, కేవలం ముషారికత్, ముజారిబత్ (ఉమ్మడి, భాగస్వామ్యం)ల ద్వారా అన్ని ఆర్థిక అవసరాలను సమకూర్చుకోవడం సులభతరం కాదు. ఉదాహరణకు, ఒకరికి ఉండడానికి ఇల్లు అవసరం. కాని దాన్ని అతను కొనలేడు లేక కొనదలుచుకోలేదు, దానికి బదులు అద్దె ఇంట్లో ఉండదలుస్తాడు. ఇలాంటి వ్యవహారాల్లో "లాభనష్టాల్లో భాగస్వామ్యం" అనే సూత్రం పనికిరాదు. ఇంకొక వ్యక్తి ఒక వాహనాన్ని కొనదలుస్తాడు. కాని దాని మొత్తం విలువను వెంటనే చెల్లించే స్థోమతలేక వాయిదాల్లో చెల్లించదలుస్తాడు. ఇలాంటి విషయాల్లోనూ లాభనష్టాల్లో భాగస్వామ్యం అనే పద్ధతి పనికిరాదు. ఇస్లామీయ షరీయత్ బోధనలు వాస్తవాలపై ఆధారపడుతూ ఆచరణకు యోగ్యమైనవి కనుక దాని మౌలిక సూత్రాలతో విభేదించని, ఇలాంటి అవసరాలను నెరవేర్చే అన్ని పద్ధతుల్ని అనుమతిస్తుంది. అందుకనే అది వాస్తవ వస్తువుల్ని లేక వాటి వినియోగ

హక్కులకు సంబంధించిన క్రయవిక్రయాల కొన్ని పద్ధతుల్ని అనుమతించింది. వాటన్నిటిలో సుపరిచితమైన, వాడుకలోనున్న కొన్ని పద్ధతులు ఏమిటంటే, తదనంతరం అంటే భవిష్యత్తులో జరిగే విక్రయం, అరువు ఇచ్చినందుకు అధిక ధర తీసుకోవడం, అద్దెకు తీసుకోవడం, సహాయ ఋణము, కొనుగోలుకై ముందు వెలనిచ్చుట. ఈ అన్ని పద్ధతులు కూడా నిజమైన వస్తువులు లేక వాటి వినియోగపు హక్కుల క్రయవిక్రయాలతో సంబంధం కలిగి ఉంటాయి. ఈ పద్ధతులన్నిటిలోని ముఖ్య ఉద్దేశమేమిటంటే, ప్రజలు కొన్ని వస్తువులను కోరుకుంటున్నారు, కాని వాటి మొత్తం మూల్యం చెల్లించటానికి వారి వద్ద వాటి విలువకు తగినంత ధనం ఉండదు లేదా ఒకేసారి పూర్తి మొత్తాన్ని చెల్లించ దలచుకోలేదు, అలాంటి వస్తువుల్ని వడ్డీతో కలుషితం కాకుండా ప్రజలు పొందగలగాలి. ఈ అన్ని పద్ధతుల్లో మొత్తం మూల్యం వెంటనే చెల్లించకుండానే ఆ వస్తువును పొందడానికి లేక ఆ వస్తువుపై పూర్తి యాజమాన్యపు హక్కు రాకపోయినా, వినియోగించుకునే సౌకర్యం కొనుగోలుదారుకు ఒకవైపు లభిస్తే, వేరొక వైపు అమ్మకందారుకు (వస్తువు యజమానికి) లాభనష్టాల్లో భాగ స్వామ్యంలో ఎదురయ్యే ప్రమాదాలకన్నా ఇలాంటి వ్యవహారాల్లో తక్కువ రిస్క్ ఉందనే మనశ్శాంతి చేకూరుతుంది.

పైన పేర్కొన్న పద్ధతులన్నిటిలో అత్యధికంగా వినియోగంలోనున్న పద్ధతులు బయీమువజ్జల్ (అరువు వ్యాపారం), ఇజారహ్ (అద్దె లేక కిరాయి) అనేవి ప్రముఖమైనవి. బయీమువజ్జల్ అంటే అరువు వ్యాపారంలో ఒక వ్యక్తి ఒక వస్తువును కొనుగోలు చేస్తాడు, కాని దాని మూల్యాన్ని ఇరువురి అంగీ కారంతో కొంతకాలం తరువాత ఒకేసారో లేక వాయిదాల్లోనో తీర్చుతాడు. దీన్నే షరీయత్ పరిభాషలో 'మురాబహ' అని కూడా అంటారు. ఇక ఇజారహ్ అంటే అద్దె (Leasing)లో ఒక వ్యక్తి తనకు అవసరమైన వస్తువునైతే కొనడు, కాని దాని వినియోగపు హక్కును అద్దె చెల్లించి పొందుతాడు. కొన్ని

సందర్భాల్లో, ఇరువురి అంగీకారాలతో తాను అద్దెకు ఉపయోగిస్తున్న ఫలానా వస్తువుకు ఒక నిర్ధిష్ఠ సమయం తరువాత అద్దె చెల్లిస్తున్నవాడు యజమాని అవుతాడని నిర్ణయించుకునే అవకాశం కూడా ఉంది. అయితే సలమ్ (సహాయ ఋణము లేక కొనుగోలుకై ముందే వెలనిచ్చుట)లో, బయీముఅజ్జల్ (అరువు వ్యాపారం) నకు భిన్నంగా కొనుగోలుదారు మూల్యాన్ని ముందే చెల్లిస్తాడు. కాని ఆ వస్తువును ఒక నిర్దిష్ట సమయం తరువాత పొందుతాడు. ఉదాహరణకు, ఒక రైతు తన అవసరాలకు సరిపడ డబ్బును ఒక వ్యాపారి నుండి ముందే తీసుకుని, తన పత్తి పంట వచ్చిన తరువాత, నిర్ణీత సమయంలోగా, ఒక నిర్దిష్ట పరిమాణాన్ని లేక భాగాన్ని ఒక నిర్ణీత ధరపై ఇస్తానని ఒప్పందం చేసుకొని, డబ్బు తీసుకుంటాడు. ఈ విధంగా రైతుకు వడ్డీపై అప్పు తీసుకునే అవసరం రాదు. ఇక ఇస్‌తిస్నా (పనికి, శ్రమకు మూల్యం నిర్ణయించుట)లో పద్ధతి ఏమిటంటే, ఒక వ్యక్తి తనకు అవసరమైన ఒక వస్తువును తయారుచేయమని, పనిచేసేవాణ్ణి లేక గుత్తేదారును కోరుతాడు, ఆ వస్తువు ధరను వస్తువు అప్పగించే సమయంలోనైనా లేక ఆ తరువాతనైనా ముందే అనుకున్న విధంగా చెల్లిస్తాడు. ఇవే కాకుండా ఇంకా అనేక పద్ధతులున్నాయి. అయితే అవన్నీ కూడా పై పద్ధతుల్లోని శాఖోపశాఖలు మాత్రమే. అందుకని వాటి వివరాల్లోకి వెళ్ళనవసరం లేదు.

ముజారిబత్ (వాటా, భాగస్వామ్యం), ముషారికత్ (ఉమ్మడి) మరియు క్రయవిక్రయాలకు సంబంధించిన పై పద్ధతుల ద్వారా అవి ప్రభుత్వపరమైనా, లేక ప్రైవేటు సెక్టరుకు సంబంధించినవైనా ఆర్థిక మరియు పెట్టుబడికి సంబంధించిన అన్ని అవసరాలు పూర్తి చేసుకోవచ్చు. అందుకని వడ్డీరహిత వ్యవస్థలో నేటి ఆధునిక కాలపు ఆర్థిక అవసరాల్ని తీర్చే స్థోమత లేదని ఏ ఒక్కరూ చెప్పలేరు.

ఏదైనా ఒక వస్తువు యాజమాన్యపు హక్కు లేక దాని వినియోగపు

హక్కును పొందటానికి ఇస్లామీయ షరీయత్ ఏ పద్ధతులనైతే ఆమోదించిందో అందులో లాభ నిష్పత్తిని ముందే నిర్ణయించడం జరుగుతుంది. బాహ్యంగా చూస్తే ఇది కూడా వడ్డీలాగే కనబడవచ్చు. ప్రవక్త మహనీయులు (స) కాలంలో కూడా కొందరు **"ఇన్నమల్ బైయూ మిస్లుర్ రిబా" (అల్‌బఖర:275)** అంటే, "క్రయవిక్రయాలు కూడా రిబా (వడ్డీ)లాగే ఉన్నాయి కదా" అంటూ అభ్యంతరం తెలిపారు. ఎందుకంటే ఇందులో లాభపు నిష్పత్తి ముందే నిర్ణయించబడుతుంది. కాని వాస్తవం అలా కాదు. ఇస్లామీయ షరీయత్ ఈ పద్ధతుల ఔచిత్యం కొరకు కొన్ని షరతులను నిర్ణయించింది. వస్తువు యజ మాని కూడా కొంత మేరకు ఇబ్బందుల్ని భరిస్తూ, అరువు లేక అద్దెకు తీసు కుంటున్న వ్యక్తి ప్రయోజనాల్ని కూడా కాపాడుతూ ఉండడం దీని ముఖ్య ఉద్దేశం. ఈ షరతుల్ని అమలు చేయడం వల్ల వడ్డీ నిషేధపు ఆజ్ఞల్ని ధిక్కరించే అవకాశం, బాహ్యంలో కనిపించని పెట్టుబడిదారీ వ్యవస్థ రూపం సంతరించు కునే అవకాశం లేకుండా పోతుంది.

## అభ్యంతరాలు

ఆధునిక కాలంలో పెట్టుబడికి సంబంధించిన ఇస్లామీయ పద్ధతుల పునరుద్ధరణపై అనేక అభ్యంతరాలను లేవదీయడం జరిగింది. అందులో కొన్ని ఈ క్రింది విధంగా ఉన్నాయి.

**నైతిక పతనం :** బ్యాంకుల నుండి లాభనష్టాల్లో భాగస్వామ్యపు ప్రాతిపదికపై అప్పు తీసుకున్నవారు నైతికంగా అత్యంత పతనావస్థకు చేరుకున్న నేటి కాలంలో తమకు వచ్చిన లాభాన్ని సరిగ్గా తెలుపుతారని ఆశించగలమా? అనేది అందులో ఒక అభ్యంతరం. కేవలం నైతిక ఉన్నత్వపు భావనపై ఎప్పుడూ ఏ వ్యవస్థా నడవజాలదు, ప్రజలు దీని ఆధారంగానే తమ వ్యవహారాల్ని ఎప్పుడూ నడుపుకోరు అనేది దీనికి సమాధానం. ప్రతి కాలంలోనూ ప్రజలు తమ ప్రయోజనాల్ని కాపాడుకోవడానికి నైతిక విలువల్నే కాకుండా వివిధ

పద్ధతుల్నీ అవలంబించారు. తమ ఇళ్లకు, దుకాణాలకు తాళాలు వేసి వాటిని భద్ర పరుచుకున్నారు. ఒప్పందాలపై సంతకాలు చేసుకున్నారు. దొంగతనం, మోసాలకు పాల్పడిన వారిని సముచితంగా శిక్షించడానికి సమాజాలు, ప్రభుత్వాలు బహిష్కారం, ఇంకా ఇతర శిక్షల వ్యవస్థను ఏర్పాటు చేసుకున్నాయి.

ఈ పద్ధతులను కోరుకునేవాటిలో, సమకూర్చుకునేవాటిలో మార్కెట్ శక్తులు (Market Forces) ప్రథమ స్థానంలో ఉంటాయి. ఇవి నైతిక బలహీనత పై గట్టి పట్టును కలిగి ఉంటాయి. బ్యాంకుల నుండి అప్పు తీసుకుని చేసే వ్యాపారాలు ఒకటి రెండు మాత్రమే ఉండవుగా! వందల, వేల సంఖ్యలో ఉంటాయి. ఎవరైనా ఒకరిద్దరు వ్యాపారులు మోసానికి పాల్పడితే, ఈ విషయం మార్కెట్‌లో వ్యాపారం చేస్తున్న ఇతర వ్యాపారుల లాభనష్టాల రికార్డుల ద్వారా, ప్రత్యేకించి నిజాయితీగల వ్యాపారుల లెక్కల వల్ల బహిర్గతమవుతుంది. ఈ విషయం తద్వారా వ్యాపారులందరికి, బ్యాంకులన్నిటికీ తెలిసిపోతుంది. ఈ విధంగా మోసానికి పాల్పడే వ్యాపారుల పరపతికి మచ్చ ఏర్పడుతుంది. ఫలితంగా అలాంటి వ్యాపారుల్ని, ఇతర వ్యాపారులు, బ్యాంకులు విశ్వసించవు, వారిని దరికి చేరనీయవు. ఈ విధంగా వారు తమ కాలును తామే నరుక్కుని, తమ భవిష్యత్తును అంధకారం చేసుకున్నవారవుతారు.

అయితే కేవలం మార్కెట్ శక్తులను మాత్రమే పూర్తిగా నమ్ముకొని ఊరుకుంటే సరిపోదు. బ్యాంకులకు రక్షణ సమకూర్చడానికి, వారి కార్యకలాపాల్లో సహాయమందించడానికి భాగస్వామ్య సంస్థలను (Shared Institutions) ఏర్పాటు చేయవలసిన అవసరముంటుంది.[13] వీటిలో బ్యాంకుల, కంపెనీల మరియు వ్యాపారుల అప్పుతీర్చే స్థోమతను నిర్ణయించే సంస్థలు (Credit Rating Agencies) కూడా ఉంటాయి. ఇలాంటి సంస్థలు బ్యాంకులతో వ్యవహారం నడిపే వ్యాపారులందరి గురించి అవసరమైన పూర్తి సమాచారాన్ని సేకరిస్తాయి, వారి లెక్కల్ని పరిశీలిస్తాయి, మార్కెట్‌లో వారి పరపతిని, వారి

నిజాయితీని, వారి నడవడికల్ని, వారి పేరు ప్రఖ్యాతల్ని అంచనావేస్తాయి.

అనేక దేశాల్లో ఇలాంటి సంస్థలు ఉన్నాయి. వర్ధమాన దేశాల్లో కూడా ఇలాంటి సంస్థలు ఏర్పడడం ప్రారంభమయింది. క్రమక్రమంగా ఇలాంటి సంస్థలు బలపడతాయి. చివరికివి అన్ని బ్యాంకుల, కంపెనీల, వ్యాపారుల పరపతిని, నిజాయితీని, క్షమతను తెలుసుకోగలుగుతాయి. వీరి పరపతి క్షమతస్థాయి (Credit Rating) ఏపాటిదో నిర్ణయించబడకుండా, లాభనష్టాల్లో భాగస్వామ్య ప్రాతిపదికగా బ్యాంకులతో వ్యవహారం నడపడం కష్టమైపోతుంది. కనుక ప్రతి ఒక్కరూ ఇలాంటి సంస్థలతో సహకరించడానికి వివశులైపోతారు. ఎవరైతే సహకారమందించరో అలాంటి వారి పరపతి శూన్యంగా పరిగణించ బడుతుంది. దీనివల్ల స్వచ్ఛత, నైర్మల్యత పెరిగిపోతుంది. దీని ఆధారంగా ప్రజలు ఒకరితో ఒకరు వ్యవహారాలు నడుపుకోవడం ఎంతో సులువు అవుతుంది. ఇదే కాకుండా లెక్కల్ని వ్రాసే (Accounting), వాటిని పరిశీలించే (Auditing) సంస్థల్ని కూడా సంస్కరించాల్సిన అవసరముంటుంది. ఎవరైనా ఒక వ్యాపారి, బ్యాంకుకు సరియైన లెక్కలు చూపించనప్పుడు, లేక లెక్కల్ని అనుమానాస్పదం చేసినప్పుడు, అలాంటి వ్యాపారిని, అన్ని బ్యాంకులు కలిసి సంయుక్తంగా ఏర్పాటు చేసిన పరిశీలనా సంస్థ (Auditing Organisation) వద్దకు పంపాలి, ఈ సంస్థ జరిపిన పరిశీలనలో ఆ వ్యాపారి లెక్కల్లో అవినీతికి పాల్పడ్డాడని రుజువయితే, అతని పేరు వార్తాపత్రికల్లో ప్రచురింపబడాలి, చాంబర్ ఆఫ్ కామర్స్ (Chamber of Commerce), వ్యాపార సంస్థలు (Trade Associations) అలాంటి వ్యక్తిని మార్కెట్ నుండి బహిష్కరించాలి.

మధ్యయుగంలో ఇలాంటి వ్యక్తులు అత్యంత హీనదృష్టితో చూడబడే వారు; అవసరమనుకుంటే మొత్తం సమాజమే వారిని బహిష్కరించేది. అందు కని వారు తమ వాగ్దానాల్ని, ఒప్పందాల్ని నెరవేర్చటానికి నిబద్ధత కలిగి ఉండే వారు, ఇతరుల హక్కుల్ని సంపూర్ణంగా నెరవేర్చేవారు. నేటి ఈ ఆధునిక

కాలంలో కూడా చాంబర్ ఆఫ్ కామర్స్, ఇంకా వ్యాపార సంస్థలు ఇలాంటి పాత్రనే పోషించకపోవటానికి ఎలాంటి కారణమూ లేదు. ముఖ్యంగా ముస్లిం సమాజంలో ప్రజలు తమ ఒప్పందాల్ని నెరవేర్చగలుగుతారు, అందువల్ల వారిలో పరస్పరం విశ్వాసం పెరిగిపోతుంది. అయితే ఇలాంటి వ్యవహారం కేవలం బ్యాంకింగ్ వ్యవస్థ వరకే పరిమితం కాకుండా ముస్లిం సమాజంలోని అన్ని రంగాల్లో సంస్కరణ జరగటానికి ఇదెంతో అవసరం. మొత్తం సమాజం ఇలాంటి ఆచరణను అవలంబిస్తే, వ్యాపారులు మోసగించటానికి, అవినీతికి పాల్పడటానికి భయపడతారు. ఇంకా కంపెనీల డైరెక్టర్లు కూడా షేర్ హోల్డర్ల లాభాన్ని కాజేయడానికి వెనక్కితగ్గుతారు. చెడ్డవారి దుష్కర్మలకు తగిన ప్రతిఫలం లభించినప్పుడే ఖుర్ఆన్ చాటిన "మంచిని ప్రేరేపించండి, చెడును నిర్మూ లించండి" అనే బోధన సక్రమంగా అమలవుతుంది. ఈ లక్ష్యం కోసం బ్యాంక్ ట్రిబ్యునల్స్, షరీయత్ న్యాయ స్థానాలను (Bank Tribunals and Shariah Courts) ఏర్పాటు చేయడం వల్ల ఇలాంటి కేసులు ఎన్నో సంవత్సరాలు పెండింగ్‌లో ఉండకుండా సత్వర పరిష్కారాలు జరుగుతాయి.

పైనుదహరించిన సంస్థలన్నీ కేవలం ఇస్లామీయ బ్యాంకింగ్ వ్యవస్థకే అవసరమవుతాయని ఎవరూ పొరపడనవసరం లేదు. ఇస్లామీయ బ్యాంకులకు ఉపయోగపడే రీతిలోనే వడ్డీతో కూడిన బ్యాంకులకు కూడా ఈ సంస్థలు ఎంతో ఉపకరిస్తాయి. ఇలాంటి సంస్థలున్న దేశాల్లో బ్యాంకులు నిరాటంకంగా పని చేస్తున్నాయి. ఆ దేశాల ఆర్థిక వికాసానికి గణనీయమైన సేవలను అందిస్తు న్నాయి. వర్ధమాన దేశాల్లో వడ్డీతో కూడిన బ్యాంకులకు కూడా అప్పులు సకాలంలో వసూలుకాక అనేక ఇబ్బందులు ఎదురవుతున్నాయంటే అక్కడ ఇలాంటి సంస్థలు లేకపోవడం కూడా ఒక ముఖ్యకారణం.

కేవలం రెండే రెండు విషయాలు ప్రజల్ని నిజాయితీగా ఉండడానికి దోహదపడతాయి. ఒకటి, మరణానంతరం దైవం ముందు జవాబు చెప్పుకోవాల్సి ఉంటుందనే స్పృహ, రెండవది, ప్రపంచంలో అపఖ్యాతి పాలవుతామని,

శిక్ష పడుతుందనే భయం. పరలోకంలో లభించే శిక్ష పట్ల అందరి విశ్వాస, నమ్మకాలు దృఢంగా ఉండకపోవచ్చు. కనుక ప్రపంచంలో అపఖ్యాతి, శిక్షలు అనివార్యం. ఇస్లాం ఈ రెండింటినీ ప్రోత్సహించింది. ఎవరైనా తన దుకాణానికి తాళం వేసుకోకపోతే దొంగతనం జరుగుతుంది, ఇక ప్రభుత్వం దొంగల్ని పట్టుకోలేకపోయినా, పట్టుకున్నా సరియైన శిక్షలు పడకపోయినా, దొంగతనాలు తగ్గకపోవడమే కాదు, ఇంకా పెరిగిపోతాయి. ఈ విషయంలో ప్రభుత్వాలు అలసత్వం చూపి, ఉపేక్ష వహించి, దోపిడీ దొంగతనాలు, వంచనమోసాలు, హత్యాకాండలు వాటంతట అవే ఆగిపోతాయని ఆశపడితే, అవి వాటి అడియాశలే అనబడతాయి తప్ప ఇంకేమీ కాదు. ప్రత్యేకించి ప్రజలకు ఎలాంటి జవాబుదారుకాని నియంతృత్వ ప్రభుత్వాలు ఇలాంటి వాటికి పాల్పడతాయి. చెడు వ్యక్తులకు, సంఘ వ్యతిరేక శక్తులకు శిక్షలు పడకపోయినప్పుడు, సత్యం న్యాయాలను పాతిపెట్టినట్లే అవుతుంది. ఫలితంగా సమాజం వినాశనం వైపునకు పయనిస్తుంది. దివ్యఖుర్‌ఆన్ ఈ విషయంలో తిరుగులేని తీర్పు నిచ్చింది. **"ఏదైనా అన్యాయం చేసి దాని పాప భారాన్ని తన నెత్తిపై మోసేవాడు అప్పుడు నష్టపోతాడు" (తాహా:111)**. ప్రవక్త మహనీయుల (స) అనేక ఉల్లేఖనాలు (హదీసులు) కూడా ఈ విషయాన్నే ధృవీకరిస్తాయి, ఇంకా అనేక మంది ముస్లిం విద్వాంసులు, ధార్మికవేత్తలు కూడా ఈ విషయాన్నే నొక్కి చెప్పారు.

## డిపాజిట్ల (Deposits)లో తగ్గింపు

ఇస్లామీయ బ్యాంకింగ్ వ్యవస్థపై చేసే రెండవ విమర్శ ఏమిటంటే, బ్యాంకుల్లో తమ డబ్బును దాచిపెట్టుకున్నవారు నికరలాభాన్ని (వడ్డీ రూపంలో) కాకుండా, లాభనష్టాల్లో భాగం పంచుకోవాల్సి ఉంటుందని తెలియగానే తాము నష్టపోతామేమోననే భయంతో బ్యాంకుల్లోని తమ డిపాజిట్లను వెనక్కు తీసేసుకుంటారు.

ఎవరైనా సరే ఈ విధమైన భయానికి గురి కావలసిన అవసరం లేదు, ఇతర బ్యాంకుల్లో మాదిరిగా, ఇస్లామీయ బ్యాంకింగ్ వ్యవస్థలో కూడా వివిధ రకాల, ఇంకా నిర్ణీత కాల పరిమితితో కూడిన ఖాతాలు తెరువడానికి అవకాశ ముంటుంది. వాటిలో కొన్ని తమకు కావలసిన ధనాన్ని జాప్యం చేయకుండా చెల్లించే (Demand Deposits) ఖాతాలూ ఉంటాయి. వివిధ వ్యవధులతో కూడిన ఉమ్మడి (పొత్తు) ఖాతాలు కూడా ఉంటాయి.

తమకు కావలసినప్పుడు చెల్లించే (Demand Deposits) ఖాతాలకు ఎలాంటి లాభం ఇవ్వడం జరుగదు కనుక నష్టంలో కూడా వారికి ఎలాంటి భాగం ఉండదు. ఈ విషయాన్ని ధృవీకరించడానికి డిపాజిట్లపై ఇన్సూరెన్స్ (Deposit Insurance) చేయాల్సిన అవసరం ఉంటుంది. తద్వారా డిపాజిటు దార్లకు తమ ఖాతాలు అన్ని విధాలుగా సురక్షితంగా ఉంటాయనే విశ్వాసం ఏర్పడుతుంది.[14] అయితే భాగస్వామ్యానికి సంబంధించిన ఖాతాలపై లాభ నష్టాల్లో భాగం పంచుకునే షరతు వర్తిస్తుంది. అంటే నష్టం రాకుండా చేయ డానికి లేక కనీసం నష్టాన్ని ఎదుర్కోవడానికి ఏ పద్ధతులు, సాధనా లున్నాయో, అవి అవలంబించబడవని దీని అర్థం ఎంతమాత్రం కాదు. ఉదా హరణకు, సక్రమమైన వ్యవహారశైలి (Corporate Governance )పై నేడు అత్యధికంగా శ్రద్ధ తీసుకోవడం జరుగుతున్నది. తత్ఫలితంగా ప్రతి బ్యాంకు పాలక వర్గం తన బాధ్యతల్ని సక్రమ రీతిలో నెరవేర్చటానికి కట్టుబడి ఉంటోంది. దీనికోసం ఆంతరంగిక పర్యవేక్షణ (Internal Audit), బాహ్య పరిశీలన (External Audit) రెండూ కూడా ఫలదాయకం (effective)గా ఉండడం అత్యంతవసరం. బ్యాంక్ పాలక వర్గం ముప్పులను నిర్ధారణ చేయడం, వాటి నుండి తప్పించుకోవడం (risk management) కోసం సాధ్యమైనన్ని పద్ధతుల్ని అవలంబించటం కూడా అత్యంతవసరమే. తమకున్న ఆస్తులన్నిటిని ఏ విధంగా వినియోగించాలంటే, ఏ ఒక్క చోటనో నష్టం వాటిల్లితే ఆస్తంతా తరిగిపోకూడదు. దానికి బదులుగా

ఒక చోట నష్టం వాటిల్లినా, ఇతర చోట్ల నుండి వచ్చిన లాభాలు దాన్ని భర్తీచేయగలగాలి. ముప్పులను ఎదుర్కొనే విషయంలో ఇంకొక పద్ధతి కూడా అనివార్యం. అత్యధిక లాభాలు వచ్చిన సంవత్సరాల్లో, ఆ లాభాల్ని బ్యాంకు తన ఖాతాదారులకు పంపిణీ చేయకుండా తన కేంద్రీకృత (reserves) నిలువను వృద్ధి చేసుకోవాలి. ఈ విధంగా నష్టాలు వచ్చిన సంవత్సరాల్లో ఖాతాదారులు నష్టానికి గురి కాకుండా నివారించవచ్చు.

సరియైన నియమాలు, నిబంధనలను రూపొందిస్తూ, తరచుగా పరిశీలన, పర్యవేక్షణలు జరుపుతూ, బ్యాంకుల వ్యవస్థ సక్రమంగా నడుస్తున్నదనే విషయంలో తృప్తిపడడానికి కేంద్రీయ బ్యాంకు (Central Bank) కూడా తన పాత్రను సంపూర్ణంగా పోషించాల్సి ఉంటుంది. ఈ పద్ధతులన్నీ కేవలం ఇస్లామీయ బ్యాంకుల వ్యవస్థ కోసమే కాదు, అన్నిరకాల బ్యాంకులకు కూడా అత్యవసరమైనవే, అందుకనే నేటి కాలంలో ప్రపంచమంతటా వీటిని ఆచరించడానికి ప్రోత్సహించడం జరుగుతున్నది. కేంద్రీయ బ్యాంకు తన విధుల్ని సక్రమంగా నిర్వర్తించనప్పుడు, రాజకీయ సిఫారసులపై అర్హతలకు అతీతంగా అప్పులు జారీ చేయబడుతున్నప్పుడు, ఎలాంటి బ్యాంకు వ్యవస్థ కూడా సక్రమంగా పనిచేయజాలదు. ఇవన్నీ చేసినప్పటికి కూడా వాటికి నష్టం వచ్చే అవకాశమే లేదని మేమనడం లేదు.

అయితే నష్టాలు వచ్చే ముప్పు ఇతర వ్యాపారాల్లో, షేర్లపై ఆధారపడిన కంపెనీ ( Joint Stock Companies)ల్లో కూడా సర్వసామాన్యమే కదా! నష్టం వస్తుందనే భయంతో వాటికి కావలసిన పెట్టుబడులు తగ్గిపోనప్పుడు, కేవలం నష్టం వస్తుందనే భయంతో లాభనష్టాల్లో భాగస్వామ్యం గల పొత్తు ఖాతాలు, ఉమ్మడి ఖాతాలు తగ్గిపోతాయని భావించడం ఎంతవరకు సమంజసం? పొత్తు లేక ఉమ్మడి ఖాతాల్లో కూడా ఎన్నో రకాలుంటాయి. ఉదాహరణకు, కొన్ని రకాల ఖాతాల్లో నష్టం వచ్చే ముప్పు చాలా స్వల్పంగా ఉంటుంది. అయితే

దానితోపాటే లాభాలు కూడా స్వల్పంగానే ఉంటాయి. దీనికి భిన్నంగా కొన్ని ఖాతాల్లో నష్టాలు ఎక్కువుంటాయి. కాని దీనికి తోడుగా లాభాల నిష్పత్తి కూడా అధికంగానే ఉంటుంది. ఈ విధంగా ఖాతాదారులు (Account Holders) తమ ధైర్యాన్ని, తమ శక్తిసామర్థ్యాల్ని అనుసరించి, తమకు అనువైన ఖాతాలను ఎన్నుకునే అవకాశముంటుంది.

లాభనష్టాల్లో భాగస్వామ్యం ప్రాతిపదికగా ఏర్పడిన బ్యాంకుల వల్ల ఒక లాభమైతే తప్పక చేకూరుతుంది. ఇలాంటి బ్యాంకుల్లో పెట్టుబడి పెట్టిన ఖాతాదారులు చాలా అప్రమత్తంగా ఉంటారు. తమ సంబంధిత బ్యాంకుల వ్యవహారాలను వారు జాగ్రత్తగా పరిశీలిస్తుంటారు. వాటి నుండి అత్యధిక సమాచారాన్ని రాబట్టుతుంటారు. దీనివల్ల బ్యాంకుల నిజస్థితి ఏమిటో ప్రజలు తెలుసుకోగలుగుతారు. తద్వారా బ్యాంకుల కార్యకలాపాల్లో స్వచ్ఛత మెరుగవుతుంది, బ్యాంకులు కూడా అప్పులను జారీచేయడంలో అత్యంత జాగ్రత్త వహిస్తాయి. ఈ విధంగా మొత్తం బ్యాంకింగ్ వ్యవస్థలోనే అత్యంత మేలైన క్రమశిక్షణ రూపుదిద్దుకుంటుంది. బ్యాంకుల్లో క్రమశిక్షణ కొరవడడానికి ఒక కారణం ఏమిటంటే, అవి పూచికత్తునే అత్యధికంగా విశ్వసిస్తాయి. దీనివల్ల అప్పు తీసుకోవడానికి ఉద్దేశ్యమేమిటనే విషయాన్ని అవి అంతగా పట్టించుకోవు, ఫలితంగా ఈ అప్పులు సట్టా వ్యాపారాల్లో, ఇంకితర అనవసరమైన, ప్రమాదాలతో కూడుకున్న లక్ష్యాల కోసం కూడా వినియోగించబడతాయి. లాభనష్టాల్లో భాగస్వామ్య నియమం ఉన్నట్లయితే ఇలాంటి అప్పుల్లో గణనీయంగా తగ్గుదల వస్తుంది. బ్యాంకుల వ్యవస్థ వృద్ధి చెందుతుంది, అస్థిరత తగ్గ ముఖం పడుతుంది.

## ఈ రంగంలో ఇంతవరకు సాధించిన విజయాల వివరాలు

ఇలాంటి సూత్రాల ప్రాతిపాదికన మొట్టమొదటి ఇస్లామిక్ బ్యాంక్ 1975 మార్చిలో దుబాయ్‌లో స్థాపించబడింది. ఆ తరువాత ఇలాంటి ఇతర

బ్యాంకులూ ఉనికిలోకి రాసాగాయి. 1997 చివరి వరకు ప్రపంచం మొత్తంలో 176 ఇస్లామిక్ బ్యాంకులు, ఆర్థిక సంస్థలు ఉనికిలోకి వచ్చాయి. వీటన్నిటి సామూహిక ఆస్తులు 147.7 బిలియన్ డాలర్ల వరకు చేరుకున్నాయి. వడ్డీని ఇష్టపడని వారి కోసం ముస్లిం, ముస్లిమేతర దేశాల్లో ప్రస్తుత బ్యాంకులు తెరచిన ప్రత్యేక విండోల ద్వారా సేకరించిన ఆస్తులు ఇందులో కలువలేదు. ఇటీవల సమాచారమైతే లభ్యం కాలేదు కాని వివిధ అంచనాల ప్రకారం, ఈ ఆస్తులు 200 నుండి 300 బిలియన్ డాలర్ల వరకు చేరుకున్నాయి. వీటి పురోభివృద్ధిని గమనించినట్లయితే ఇస్లామిక్ బ్యాంకింగ్ సిద్ధాంతం ఆచరణీయమైనదే కాకుండా అది లాభసాటిదనే విషయం కూడా రూఢీ అయిపోతుంది. OECD అభివృద్ధి కేంద్రం (Development Centre) డైరెక్టర్ Dr. Traute Wohlers Scharf తన గ్రంథంలో ఈ విషయాన్నే ఇలా ధృవీకరించారు: "ధార్మిక అభ్యంతరాల కారణంగా, బ్యాంకింగ్ వ్యవస్థతో దూరముంటూ వచ్చిన ముస్లిం సమాజంలోని కొన్ని వర్గాలను కూడా ఇస్లామిక్ బ్యాంకింగ్ వ్యవస్థ ఆకర్షించ గలిగింది. ఈ బ్యాంకులు తమ భాగస్వాములకు, లాభనష్టాల్లో భాగం పంచుకునే తమ ఖాతాదారులకు కూడా మంచి లాభాల్ని సమకూర్చిపెట్టాయి. దీనివల్ల వడ్డీరహిత వ్యవస్థ ఈ ఆధునిక కాలంలో కూడా ఆచరణయోగ్యమైన దనే విషయం తేటతెల్లమైపోయింది."[15]

ఇస్లామిక్ బ్యాంకింగ్ వ్యవస్థలో వస్తున్న ఈ శీఘ్ర పురోభివృద్ధికన్నా కూడా సంతోషించదగిన ఇంకొక విషయమేమిటంటే, ఈ శీర్షికపై వెలువడిన సైద్ధాంతికపరమైన పుస్తకాలు, పత్రికలు గణనీయంగా పెరిగిపోయాయి. ఇలాంటి పుస్తకాలు కేవలం ముస్లిం దేశాల్లోనే కాకుండా అమెరికా, యూరప్ లలో కూడా ప్రచురించబడ్డాయి. ఈ రకమైన గ్రంధాలను కేవలం ముస్లింలే కాకుండా ముస్లిమేతరులు కూడా రచించారు. ఈ విధంగా ఇస్లామీయ పెట్టుబడి విధానంపై 25 సంవత్సరాలకు పూర్వంకన్నా నేడు అవగాహన బాగా

పెరిగిపోయింది. ముజారిబత్ (ఉమ్మడి), ముషారికత్ (భాగస్వామ్యం) ఇంకా ఇస్లామిక్ బ్యాంకింగ్‌కు సంబంధించిన ఇతర పారిభాషిక పదాల అర్థం తెలిసిన వారు అప్పట్లో చాలా తక్కువగా ఉండేవారు. కాని ఆ పారిభాషిక పదాల వాడకం సర్వసామాన్యమయింది. వాటి అర్థం, భావం అందరికీ తెలిసిపోయింది. ఇస్లామిక్ బ్యాంకింగ్ వ్యవస్థ ఎదుర్కొంటున్న అనేక సమస్యలు పరిష్కృతం కావటానికి వాటిపై పునరాలోచన చేస్తూ, ఆ వ్యవస్థకు సరికొత్త రూపకల్పన (ఇజ్‌తిహాద్) చేసి తదనుగుణంగా తీర్పులు ప్రతిపాదించబడ్డాయి. ఈ రంగంలో ఉన్నత స్థాయికి చెందిన పరిశోధనాత్మక విశ్లేషణలు జరిగాయి. ఈ విషయంలో ఇలాంటి పరిశోధనలు దీనికి తగిన శాసనాలను రూపొందించడానికి బలిష్టమైన పునాదుల్ని వేస్తాయి.

ముస్లింలేకాదు, ముస్లిమేతరులు కూడా ఇస్లామిక్ డెవలప్‌మెంట్ బ్యాంక్, ఇస్లామీయ ధార్మిక సంస్థలే కాకుండా, అంతర్జాతీయ ముస్లిమేతర సంస్థలు కూడా ఈ విషయంలో ఉత్సాహాన్ని చూపుతున్నాయి. ఇలాంటి అంతర్జాతీయ సంస్థల్లో International Monitary Fund (IMF), World Bank, Bank for International Settlements కూడా ఉన్నాయి. పశ్చిమ దేశాల్లోని వివిధ యూనివర్శిటీలు కూడా దీని పట్ల అత్యధిక ఉత్సాహాన్ని కనబరుస్తున్నాయి. ఇందులో అమెరికాలోని హోవర్డ్ లా (Law) స్కూల్, రైస్ యూనివర్శిటి, బ్రిటన్‌కు చెందిన లఫ్‌బరో (Lough Borough), డర్‌హమ్ యూనివర్శిటీలు, లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ పేర్కొనదగినవి. కొన్ని యూనివర్శిటీలైతే ఈ శీర్షికపై సెమినార్లు, కాన్ఫరెన్సులు కూడా ఏర్పాటు చేశాయి. మాస్టర్స్, పీ.హెచ్.డి. డీగ్రీలు కూడా ప్రారంభించాయి.

గడిచిన మూడు దశకాల్లో అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలో పదేపదే పునరావృతమవుతున్న ఆర్థిక సంక్షోభాలు కూడా బహుశ ఇస్లామిక్ పెట్టుబడిదారీ విధానంపై దృష్టి మరలడానికి కారణభూతమయిందేమో! ఈ సంక్షోభాల కారణంగా ప్రపంచం ఒక కొత్త ఆర్థిక విధానాన్ని వెదుకుతున్నది. ఈ

విషయంలో సేకరించిన సైద్ధాంతిక సమాచారాన్ని అధ్యయనం చేస్తే, ఆర్థిక వ్యవస్థలో మేలైన, సముచితమైన క్రమశిక్షణను పరిచయం చేయడానికి అత్యంతవసరమున్నదని ప్రపంచం గుర్తించినట్లు విదితమవుతోంది. స్వంత మిగులుపై ఆధారపడిన పెట్టుబడుల్ని (Equity)పెంచుకొని, అప్పులపై ఆధారపడిన పెట్టుబడుల్ని తగ్గించుకుంటే, ఇలాంటి ఆర్థిక సంక్షోభాల తీవ్రత చాలా వరకు తగ్గిపోతుందనే ఆలోచనలు కూడా పటిష్ఠమవుతున్నాయి. పైన వివరించిన వివిధ కారణాల ఆధారంగా ఇస్లామిక్ వ్యవస్థను అర్థం చేసుకోవడంలోనూ, దాని ప్రయోజనాన్ని గుర్తించడంలోనూ గణనీయమైన పెరుగుదల వచ్చిందంటే అందులో అతిశయోక్తి లేదు.

## అవాంతరాలు

ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థకు కొన్ని అవాంతరాలు, కష్టాలు కూడా ఎదురవుతాయి. వాటిలో కొన్ని స్వాభావికమైనవే. అంటే ప్రతి క్రొత్త వ్యవస్థ ప్రారంభంలో కొంత అనుభవాన్ని పొందడంలో ఇలాంటి ఒడుదొడుకుల్ని, కష్టాలను ఎదుర్కోవడం అనివార్యమే. వీటిలో అత్యధిక ఇస్లామిక్ బ్యాంకులు చాలా స్వల్ప మొత్తాలను కలిగి ఉండటం మొదటి కారణం. వీటి సరాసరి ఆస్తులు ఒక బిలియన్ డాలర్ల కన్నా తక్కువుగా ఉన్నాయి. ఈ కారణంగా, ముప్పులను తగ్గించటానికి అత్యంతవసరమైన అంశం, అంటే తమ ఆస్తుల్ని విస్తృతం చేసే (Diversity) అవకాశం వాటికి లేదు. వనరులు పరిమితంగా ఉండడం వల్ల వివిధ ప్రణాళికల విలువను అంచనా వేయడానికి (Evaluation) వాటిని నియంత్రించటానికి (monitoring) అవసరమైన సిబ్బందిని అవి నియమించుకోలేవు.

రెండవది, ఈ బ్యాంకులు స్వల్ప మొత్తాలను కలిగి ఉండడం వల్ల, వాటి స్వంత ఆస్తులు కూడా తక్కువగానే ఉండడం వల్లనూ, ఇద్దరు ముగ్గురు అతిపెద్ద భాగస్వాములే ఇలాంటి బ్యాంకుల నిర్ణయాలను తీవ్రంగా ప్రభావితం చేయగలుగుతారు.

మూడవది, ఇలాంటి బ్యాంకులకు సమాంతరంగా సహాయక సంస్థలు (shared institutions) లేకపోవడం వల్ల అన్ని పనుల్ని ఈ బ్యాంకులు తామే స్వయంగా చేసుకోవాల్సి వస్తున్నది. అప్పుతీసుకునేవారి పరపతిని, అప్పు తీర్చే స్థోమతను నిర్ణయించడం (Credit Rating) ఈ పనుల్లో ప్రముఖమైనవి. వాటికి ఈ సౌకర్యం అందుబాటులో లేకపోవడం వల్ల లాభనష్టాల్లో భాగస్వామ్య ప్రాతిపదికగా అప్పులు జారీచేయలేకపోతున్నాయి. అందుకనే వాటి అత్యధిక వనరులు క్రయవిక్రయాల్లో, సట్టా వ్యాపారం (speculation) కోసం పెట్టే పెట్టుబడుల్లోనే వినియోగింప బడుతున్నాయి. లాభనష్టాల్లో భాగస్వామ్యం ప్రాతిపదికగా మాత్రమే పెట్టుబడులు పెట్టనంత వరకు వడ్డీరహిత బ్యాంకింగ్ వ్యవస్థ వల్ల చేకూరే లాభాలు, ప్రయోజనాలు లభ్యంకావు. అత్యధికంగా సహాయక సంస్థలు ఉనికిలోకి రానంతవరకు ఇది సంభవం కాదు. దైవకృప వల్ల ఇస్లామిక్ డెవలప్‌మెంట్ బ్యాంక్ మరియు కేంద్రీయ బ్యాంకుల సహాయ సహకారాలతో ఇలాంటి అనేక సహాయక సంస్థలు ఉనికిలోకి వచ్చాయి. కొన్ని త్వరలో ఉనికిలోకి వచ్చే దిశలో ఉన్నాయి.

నాలుగవ అంశం ఏమిటంటే, ఈ బ్యాంకుల ఖాతాదార్లు మరియు అప్పు తీసుకున్న వారిలోని అత్యధికులు ఇస్లామిక్ బ్యాంకింగ్ భావనలేమిటో, దాని లక్ష్యాలేమిటో క్షుణ్ణంగా ఎరుగరు. దీనితో పాటు ఈ బ్యాంకుల్లో పని చేస్తున్న సిబ్బందిలో అత్యధికులు ప్రస్తుతం నడుస్తున్న బ్యాంకుల నుండి వచ్చినవారే కనుక వారిలో కూడా ఈ భావన, లక్ష్యం పట్ల పూర్తి అవగాహన లేదు.

ఐదవ అంశం ఏమిటంటే, ఒక సంపూర్ణమైన ఇస్లామీయ ఆర్థిక మార్కెట్ ఉనికిలో లేదు. అందువల్ల ఈ బ్యాంకులు తమ మిగులు నగదును (Excess Liquidity) స్వల్ప వ్యవధి కోసం, లాభదాయకమైన పద్ధతుల్లో వినియోగపించే మార్గాలే లేవు, గత్యంతరంలేక అవి ప్రస్తుతం ఉనికిలో ఉన్న

ఆర్థిక మార్కెట్లలోకే వెళ్లాల్సి వస్తున్నది. ఈ కారణంగా ఈ బ్యాంకులు విమర్శలకు గురి అవుతున్నాయి. ఇదేవిధంగా ఎప్పుడైనా నగదు కొరత ఏర్పడినప్పుడు, అవసరమైన నగదును పొందడం కూడా కష్టమైపోతున్నది. దీనికి కారణం ఏమిటంటే, నగదు కొరత ఏర్పడినప్పుడు ఈ నగదును వడ్డీ లేకుండా సమకూర్చిపెట్టే సంస్థ (Lender of Last Resort) ఏదీ లేదు. అందువల్ల ప్రస్తుతం నడుస్తున్న బ్యాంకులకన్నా ఇలాంటి బ్యాంకులు ఎక్కువ మోతాదులో నగదును తమ వద్దనే భద్రపరచుకోవాల్సి వస్తుంది. తద్వారా వారి లాభాలపై చెడు ప్రభావం పడుతుంది. ఈ కారణాల వల్ల ఇలాంటి బ్యాంకుల్లో వేగవంతమైన అభివృద్ధి ఉన్నప్పటికీ, అంచనాకు తగిన అభివృద్ధికి చేరుకోలేక పోతున్నాయి. అయితే కాలం గడుస్తున్నకొద్దీ ఈ బ్యాంకులు ఇలాంటి అవాంతరాల్ని అధిగమించి, పరిస్థితులు అనుకూలించి, వాటి పురోగమనంలో శీఘ్రత వస్తుందని ఆశించవచ్చు.

## కష్టాల నివారణ

ఈ కష్టాలన్నింటినీ కేవలం ఒక బటన్ నొక్కి దూరం చేసుకోవచ్చని ఆశించలేము. అయితే క్రమక్రమంగానైనా సరే, ఈ కష్టాల్ని అధిగమించడానికి అవసరమైన కొన్ని చర్యల్ని సత్వరమే చేపట్టాల్సి ఉంటుంది. ఈ చర్యల్ని చేపట్టడంలో జాప్యం చేస్తున్నకొద్దీ, ఈ కష్టాల్ని నివారించడంలో కూడా చిక్కులు పెరిగిపోతూనే ఉంటాయి. చేపట్టవలసిన ఈ చర్యల్లో ప్రభుత్వం, కేంద్రీయ బ్యాంకు తమ వ్యవహారశైలిని మార్చుకోవాలి, ఇస్లామిక్ బ్యాంకింగ్‌కు కావలసిన సముచిత వాతావరణాన్ని, పరిస్థితుల్ని కల్పించాలి.

ఈ సముచిత, సానుకూల వాతావరణాన్ని నెలకొల్పడానికి అనేక విషయాలు అవసరమవుతాయి. ఇస్లాం ప్రతిపాదించే ఆర్థిక సంబంధమైన వ్యవస్థ అవసరాన్ని అనుసరించి, శాసనాల్లో సముచిత సంస్కరణలు తేవడం మొదటిది. ప్రస్తుతం అమలులోనున్న శాసనాల్లో కొద్దో గొప్పో మార్పు చేసి

లేక కొన్ని సవరణలు చేసి పని నడుపుకుందామంటే సరిపోదు. దీనికి బదులు షరీయత్ ప్రతిపాదిస్తున్న ఉన్నత లక్ష్యాల్ని దృష్టిలో పెట్టుకుని శాసనాలను రూపొందించాల్సి ఉంటుంది. అలా చేయగలిగితే ఒక వైపు ఇస్లామీయ బ్యాంకింగ్ వ్యవస్థ పటిష్ఠమవడమేకాక వేరొక వైపు షరీయత్ లక్ష్యాలను చేరుకోవడం సుగమమైపోతుంది. ఇలాంటి శాసనాలు చేస్తున్నప్పుడు ప్రస్తుతం మన బ్యాంకుల్లో చోటుచేసుకున్న అన్ని బలహీనతలపై దృష్టిని కేంద్రీకరించాల్సి ఉంటుంది. ఒక లోపభూయిష్టమైన వ్యవస్థను సంపూర్ణంగా సంస్కరించకుండా, ఉన్న దానిని ఉన్నట్లుగా ఇస్లాం జోలెలో పడవేస్తే, అది ఇస్లాం పట్ల తీరని అన్యాయం చేసినట్లే అవుతుంది.

శిక్షణకు సక్రమమైన, సముచితమైన ఏర్పాటు జరగడం అత్యంతవసరం. బ్యాంకుకు సంబంధించిన ఖాతాదారుల, రుణగ్రహీతల, సామాన్య ప్రజల శిక్షణతోనే సరిపోదు, బ్యాంకుల డైరెక్టర్లు, పరిపాలకులు మరియు సిబ్బందికి కూడా సముచిత శిక్షణ ఇవ్వడం అనివార్యమనే విషయం దృష్టిలో ఉండాలి. వీరందరిలో కూడా ఇస్లామిక్ బ్యాంకింగ్ వ్యవస్థ అంటే ఏమిటి? దాని లక్ష్యాలేమిటి? దీనికి, వడ్డీతో కూడిన బ్యాంకింగ్ వ్యవస్థకు గల మౌలిక భేదం ఏమిటనే దానిపై సంపూర్ణ అవగాహన ఏర్పడాలి. అప్పుతీసుకునేవారి పరపతి, స్థోమతల గురించి కూడా సంపూర్ణ జ్ఞానముండాలి. దీనికోసం క్రెడిట్ రేటింగ్ ఏజన్సీ (Credit Rating Agencies) ఏర్పాటు అనివార్యమైపోతుంది.

అకౌంటింగ్ (Accounting ), ఆడిటింగ్ (Auditing) వ్యవస్థను కూడా సంస్కరించాల్సి ఉంటుంది. అవి సమర్పించే రిపోర్టులలో పారదర్శకత ఉండాలి. ఈ వ్యవస్థ, నిష్పక్షపాతంగా పనిచేయగలిగితే, దాని రిపోర్టుల ఆధారంగా లెక్కలు స్పష్టంగా, నిజాయితీతో ఉంచగలుగుతున్నారా? లేదా? అనేది విదితమైపోతుంది. ఇంకా చూపబడుతున్న లాభాలు లేక నష్టాలు

నమ్మదగినవనే విశ్వాసం ఏర్పడుతుంది. అన్ని బ్యాంకులు కలిసి ఒక పరిశీలక సంస్థ (Audit Organisation)ను ఏర్పాటు చేయవలసిన అవసరముంటుంది. ఏ మెంబర్ బ్యాంకు అయినా, తన ఖాతాదారు అయిన ఓ వ్యాపారి సమర్పించిన లెక్కలు అనుమానాస్పదంగానూ, బ్యాంకును మోసగించేవిగాను ఉన్నాయనిపించినప్పుడు, ఆ వ్యాపారిని ఈ పరిశీలక సంస్థ (Audit Organisation)కు పంపించే అవకాశముండాలి. ఇలాంటి సామూహిక వ్యవస్థలు లేకపోతే, ఈ పరిశీలనా కార్యక్రమాన్ని ప్రతీ బ్యాంకు స్వయంగా చేపట్టాల్సి ఉంటుంది. దీనివల్ల బ్యాంకుల ఖర్చుల భారం విపరీతంగా పెరిగిపోతుంది.

అవినీతికి, మోసానికి పాల్పడే వ్యాపారుల్ని, పారిశ్రామికవేత్తల్ని ఆర్థికంగా, సామాజికంగా ఏరివేయడానికి, బహిష్కరించడానికి చాంబర్ ఆఫ్ కామర్స్, ట్రేడ్ అసోసియేషన్స్(Trade Associations)లలో అవగాహన పెరగాలి. ఇలాంటి అవినీతిపరులు కేవలం బ్యాంకుల్నే మోసగించడం కాదు, తమ కస్టమర్లను, తమ భాగస్వాముల్ని కూడా మోసగిస్తారు. బ్యాంకులకు సంబంధించిన నేరారోపణల్ని సత్వరంగా పరిష్కరించడానికి షరీయత్ కోర్టులు, బ్యాంక్ ట్రిబ్యునల్స్‌లను ఏర్పాటు చేయడం కూడా అనివార్యమే.

ఇలాంటి అనేక సంస్కరణల్ని ప్రతిపాదించి, ఇవి అమలు జరగనంత వరకు ఇస్లామిక్ బ్యాంకింగ్ వ్యవస్థ వైపు పురోగమించకూడదనే ఉద్దేశ్యం కాదు. దానికి భిన్నంగా ఇలాంటి వ్యవస్థ నడుస్తున్నప్పుడే దాన్ని సమర్థించడానికి, పటిష్ఠపరచడానికి ఈ సంస్కరణల్ని గంభీరంగా ఆలోచించి ప్రవేశపెట్టే అవసరము, అవకాశమూ ఉంటుంది.

పై వివరాల వల్ల ఇస్లామిక్ వ్యవస్థ కళ్ళుమూసి తెరిచినంతలోపే ఉనికిలోకి వచ్చే విషయం కాదని, ఇది క్రమక్రమంగానే వస్తుందనే విషయం తేటతెల్లమైపోతుంది. మెల్లమెల్లగా, క్రమానుసారంగా రావడంలో తప్పులేదు.

స్వయంగా ప్రవక్త మహనీయులు (స) అనేక సంస్కరణల్ని సమాజంలో క్రమ క్రమంగానే, నిదానంగానే పరిచయం చేస్తూ, ఆచరణలో పెడుతూ వచ్చారు. అయితే ఈ నిదానానికి అర్థం, ఇస్లామిక్ వ్యవస్థను ప్రవేశపెట్టడానికి అవసరమైన ప్రయత్నాలను కూడా వాయిదా వేయడం లేక అందులో అలసత్వం చూపడం ఎంతమాత్రం కాదు. ఒకవేళ ఇలాగే అలసత్వం వహిస్తే, నిర్లక్ష్యం చేస్తే, మనం కోరుకుంటున్న ఈ వ్యవస్థ అసలు ఉనికిలోకే రాజాలదు. సమాజ సంస్కరణ జరగనంతవరకు ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థను అమలులోకి తేవడం సాధ్యపడదని మనలోని కొందరు అధికార వర్గాలు చెబుతున్న విషయం ఎంతమాత్రం ఆమోదయోగ్యమైనది కాదు. సమాజ ప్రక్షాళన చేయడమూ అవసరమే, దానితోపాటే ఈ వ్యవస్థ ఏర్పాటుకు అవసరమైన సంస్థల్ని రూపొందించే చర్యలు పూర్తి నిజాయితీతో, ఏకాగ్రతతో చేపట్టడం కూడా అత్యంత అవసరమే. ప్రస్తుతమున్న వ్యవస్థ, ఇస్లామిక్ వ్యవస్థతో క్రమక్రమంగా మారుతూపోయే కొలది, ఈ సహాయక సంస్థలు గట్టిపడుతూ పోతాయి. ఫలితంగా ఇస్లామీయ వ్యవస్థ బలపడుతూ పోతుంది. దాని ఫలాలతో ప్రజలు లాభపడతారు.

ఈ చర్య వల్ల ప్రభుత్వానికి కూడా లాభం చేకూరుతుంది. ప్రజలు సంతృప్తి చెందనంతవరకు, ఏ రాజకీయ నాయకుడూ ప్రజల్లో ప్రీతిపాత్రుడు కాలేడు, ఏ ప్రభుత్వమూ సక్రమంగా నడవజాలదు. అందుకని ఇస్లామీయ దేశాల్లో సెక్యులర్ భావాల బీజాలునాటి, ఇస్లామ్‌ను నిర్లక్ష్యం చేయడం వల్ల ప్రభుత్వాలూ బలపడవు. దేశం అభివృద్ధిపథంలో వేగాన్ని పుంజుకోజాలవు. అందుకని ఇస్లామీయ వ్యవస్థను క్రమక్రమంగానైనా సరే, అమలులోకి తేవడం వల్ల ప్రజలు, ప్రభుత్వం ఉభయులూ లాభపడతారు. ప్రజలకు ఆర్థిక ప్రగతిని చేకూరుస్తూనే, వారి నైతిక పరిస్థితిని మెరుగుపరచే ఒక క్రొత్త వ్యవస్థ కోసం

ప్రపంచం ఎదురుచూస్తున్నది. అది కుటుంబ వ్యవస్థను దృఢపరచగలగాలి, ఆర్థిక అసమానతల్ని తగ్గించగలగాలి, ఇంకా ప్రజల్లో ప్రేమ వాత్సల్యాల్ని, సౌభ్రాతృత్వాన్ని పెంచగలగాలి. ముస్లింలలో శతాబ్దాల తరబడిగా వచ్చిన క్షీణత ఉన్నప్పటికీ ఇస్లామీయ వ్యవస్థలో ఈ యోగ్యత ఉంది. మనం పూర్తి ఏకాగ్రతతో, నిండు మనస్సుతో సంకల్పిస్తే, దైవ సహాయం కూడా మనకు తోడవుతుంది. దివ్యఖుర్‌ఆన్‌లో దైవం ఈ విషయంలో ఇలా శుభవార్తను, శాంతన వచనాన్ని తెలిపాడు: **"ఎవరైతే మా మార్గంలో శ్రమిస్తారో, ప్రయత్నిస్తారో, మేము తప్పకుండా మా మార్గాల వైపునకు వారికి మార్గదర్శకం చూపుతాము." (అల్ అన్‌కబూత్ -69)**

## ప్రకాశిస్తున్న భవిష్యత్తు

ఎన్నో కష్టనష్టాలు, ఒడిదుడుకులున్నప్పటికీ, అందులో అనేక ముస్లిం దేశాల నిర్లిప్తత ప్రముఖమైనది. ఇస్లామిక్ బ్యాంకింగ్ వ్యవస్థ గడిచిన 25 సంవత్సరాల్లో అభివృద్ధి చెందుతూ గట్టి పునాదులపై నిలబడగలిగింది. అత్యంతయోగ్యులు, నిర్మలులు, గట్టి సంకల్పము గల, చెప్పుకోదగ్గ వ్యక్తుల సంఖ్య ఈ వ్యవస్థను ముందుకు నడపడానికి, దీని మార్గంలో వస్తున్న ఆటంకాలను తొలగించడానికి గట్టి ప్రయత్నాలు చేస్తున్నారు. ఇస్లాం పునరుజ్జీవనంతోపాటు ఈ వ్యవస్థ కూడా గట్టి పడుతుందనడంలో ఎలాంటి అనుమానం లేనేలేదు. ప్రశ్న ఈ వ్యవస్థ భవిష్యత్తు గురించి కాదు, దాని భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుందనడంలో సందేహమేలేదు, అయితే ఈ వ్యవస్థను స్థాపించడంలో మన వంతు సహాయాన్ని అందించి, ప్రళయదినాన దైవం ముందు ప్రశంసకు పాత్రులవుతామా? లేక దీని మార్గంలో ఆటంకాలను సృష్టించి, ఇహపరాల్లో ఆయన శిక్షకు అర్హులమవుతామా అనేదే అసలు ప్రశ్న!

## మూడవ అధ్యాయపు పాదసూచికలు

1. 'ముజారిబత్' ఒక ఒప్పందం, ఇందులో ఒక్కరు లేక అంతకంటే ఎక్కువ మంది ఆర్థిక పెట్టుబడిని సమకూరుస్తారు. రెండవ వ్యక్తి లేక పార్టీ, తన శ్రమ మరియు యోగ్యతలతో, పరస్పరం అంగీకరించిన విధంగా లాభదాయకమైన పనుల్లో వినియోగిస్తారు. వచ్చిన లాభాన్ని ఒడంబడికను అనుసరించి అందరిలో పంచబడుతుంది. అయితే ఒకవేళ నష్టమే గనకవస్తే పెట్టుబడి పెట్టిన వారు దీన్ని భరిస్తారు. ముజారిబ్ (అంటే కష్టపడి పనిచేసిన వాని)కి అతని శ్రమ మరియు యోగ్యతలు వెచ్చించిన దానికి ఎలాంటి ప్రతిఫలం లభించదు.

2. 'ముషారికత్' అనేది కూడా ఒక ఒడంబడికే. కాకపోతే ఇందులో చేరిన వారందరూ పెట్టుబడి పెడతారు. దానితోపాటే తమ శ్రమను, యోగ్యతల్ని కూడా అందులో సమంగా వినియోగిస్తారు. లాభంవస్తే వారు చేసుకున్న ఒడంబడిక ప్రకారం పంచుకుంటారు. నష్టమేగనక వస్తే, వారు పెట్టిన పెట్టుబడుల నిష్పత్తిలో భరిస్తారు.

3. షాఫయి పద్ధతి ప్రకారం, లాభాల పంపకం కూడా పెట్టుబడుల నిష్పత్తిని అనుసరించే జరగాలి. దీనికి కారణం ఏమిటంటే, సామూహికంగా వచ్చిన లాభంలో ఎవరెంత శ్రమపడ్డారు, ఎవరి యోగ్యతలు ఎంతగా పనిచేశాయి అనేది అంచనా వేయడం కష్టం. అంతేగాకుండా ఈ భాగస్వాములందరు కూడా తమ పెట్టుబడులు మరియు లాభంలో తమ భాగస్వామ్యాన్ని అనుసరించి తమ శ్రమను, యోగ్యతల్ని కూడా వినియోగిస్తారు గనుక లాభాన్ని కూడా అదే నిష్పత్తిలో పంచాలి అనేది వారి దృక్పథం.

4. యూడోవిచ్, 1970, పేజీ. 180 మరియు 261

5. యూడోవిచ్, 1981, పేజీ. 257 మరియు 268

6. గొయిటాయెన్ (Goitein) 1967, పేజి. 235 మరియు 250. దీనితోపాటే గోయిటాయెన్ 1966, పేజీ. 271-274 చూడండి. పురావస్తు త్రవ్వకాల్లో ఈజిప్టులో జెనిజా దస్తావేజులు (Geniza Decuments) లభ్యమయ్యాయి. వాటిని అత్యంత సుదీర్ఘ పరిశ్రమ, పరిశోధనల తరువాత ప్రొఫెసర్ గోయి టాయెన్ విశ్లేషించగలిగాడు.

7. ఫాట్జ్ మిల్లర్, 1994, పేజీ. 102

8. ఫిషల్ (Fischel) 1992

9. దోరి, 1986, పేజీ. 898

10. యూడోవిచ్, 1981

11. క్రేమర్స్ (Kramers) 1952, పేజీ. 100, దీనితోపాటే Chapra 2000 పేజీ. 173-252 చూడండి.

12. ఈ అంశాలపై వివరాల కోసం Chapra 2000 (C) పేజీ. 173-252 చూడండి.

13. ఈ అన్ని సంస్థల వివరాల కోసం Chapra (C) 1985, పేజీ. 174-181 మరియు Chapra and Khan, 2000, పేజీ. 85-91లను చూడండి.

14. దీని కోసం Chapra and Khan 2000 పేజీ. 64-65 చూడండి.

15. Wohlers-Scharf 1983, పేజీ. 11-12



## ఆంగ్ల ఆధార గ్రంథాలు

1. Bach.G.L.(1977) Economics, An Introduction to Analysis and policy (Engle wood cli, NJ : (rentice Hall, 9th edi)

2. Bank for International setlement (BIS) 1988, press release, 22nd June, 1994 and 19 october,

3. Bigsten, Are (1977) "Poverty, Inequality and development" in Norman Gemmell, ed, Surveys in Development Economics (Oxford : Basil blackwell), p.p. 135-77

4. Bokare, M.G. (1993) Hindu Economics : Eternal Economic order (New Delhi : Janakai Prakasham)

5. Chapra M.Umer (1985) : Towards a Just Monetary system ( Leicester, U.K. : the Islamic Foundation, 1985)

6. Chapra, M.Umer (2000a) "Alternative vision of International monatary reform in M-Iqbal and D.Llewellyn (eds) 2002, Islamic Banking and Finance : New perspectives an Profit - Sharing and Risk (Cheltenhouse, U.K. Edward Elgar)

7. Chapra, M.Umer (2000f) "Why has Islam Prohibited Interest: Ratio Behind the Prohibitation of Interest in Islam" review of Islamic Economics, Nov.09, 2000, pp 5-20

8. Chapra M.Umer (2000c) The future of Economics : An Islamic perspective, (Leicaster, the Islamic foundation), p.p. 193-252

9. Chapra M.Umer and Tariqullah khan (2000) "Regulation and Supervision of Islamic Banks" (Jeddah : IRTI/IDB)

10. Duri, A.A. (1986) "Baghdad", The Incyclopedia of Islam (Leiden E.S.Brill) Vol.I, Pp.894 - 909

11. Fjischel, W.J.(1992), Djahbadh in the Incyclopedia of Islam Vol.2, pp 382-383

12. Friedman milton (1982) The Yo-Yo U.S.Economy Newsweek, 15 February, page 4

13. Goitein, S.D. (1966), Studies in Islamic History and Institutions (Leiden: Brill)

14. Goitein, S.D., (1967), A Miditerranean Society, (Berkley and Los Angeles: University of California Press)

15. IMF: International Financial Statistics, Nov. 1998 and Year book 2000.

16. IMF: World Economic Outlook, May 1998 and Dec, 1998 Johns, C.H.W. et.al (n.d.) "Usury" in James Hastings.

17. Encyclopedia of Religion and Ethics (New York:Charles Seribner's Sons, (n.d.),Vol. 12, pp. 548-558

18. Kindle berger, Charles (1978), Manias, panics and crashes (London Mac Millan)

19. Kramers J.H. (1952) "Geography and Commerce" in T. Arnold and A. Cmillanme (eds), The Legaey of Islam (London Oxford University Press)

20. Mills, Paul and John Presley (1999), Islamic Finance: Theory and Practice (London: Mac Millan)

21. Minsky, Hyman (1975), John Maynard Keynes (New York: Columbia University Press)

22. Mishan, E.S. (1971): Cost Benefit Analysis: An Introduction (New York: Praeger)

23. Morgan, Guarantee Trust Campany of New York (1987) World Financial Markets, January.

24. Noonan, John (1957), The Scholastic Analysis of Usury, (Cambridge, MA: Harvard University Press)

25. OECD, Economic Outlook, December 1991, and June, 2000

26. Peach, Richard, and Charles Steindel (2000), "A National of spend Thrifts? An Analysis of trends in personal and Gross Saving", Current Issues in Economics and Finance, Federal Reserve Bank of New York, Vol.6, No-10, September.

27. Robinson, John (1977), "What are the Questions? "Journal of Economic Literature, December.

28. Rogoff, Kenneth (1999) "International Institution for Reducing Global Financial Instability", The Journal of Econamic Perspectives, Fall, PP. 211-46.

29. Schatzmiller, Maya (1994), Labor in the Medieval Islamic world (Leiden: Brill)

30. Simons, Henry (1948), Economic Policy for a Free Society (Chicago: University of Chicago Press)

31. Udovitch Abraham (1981), "Bankers without Banks" Commerce, Banking and Society in the Islamic of middle ages", Princetan Near East Paper No.30 (Prince tom, NJ: Princetone University Press)

32. Udovitch Abraham (1970), Partnership and Profit in Early Islam (Princeton, NJ: Princeton University Press)

33. Wohlers-scharft, Traute (1983) Arab and Islamic Banks (Paris: OECD)

